# ప్రజా సూక్తం

తెలుగు సామెతల సంకలనం

ప్రచురణ :



రిజిష్టర్డ్ నెం. 1/64

**యువభారతి**

సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

PRAJASUKTHAM

A COLLECTION OF TELUGU SAYINGS

యువభారతి

ప్రచురణ : 19

ప్రథమముద్రణ : 3,200 ప్రతులు

డిసెంబర్ 2, 1973.

ద్వితీయ ముద్రణ : 5,2000 ప్రతులు

డిసెంబర్ 25, 1973.

ముఖపత్ర రచన, అక్షరాలంకరణ :

శ్రీ శీలా వీర్రాజు

ముద్రణ : ముఖచిత్రముద్రణ :

విజయశ్రీ ప్రింటింగ్ వర్క్స్, బషీర్‌బాగ్, హైదరాబాద్

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 500003.

కార్యాలయం :

ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు

తిలక్ రోడ్డు, హైదరాబాదు-500001.

వెల : రెండు రూపాయలు.

## రెండవ ముద్రణ మాట :



"ప్రజాసూక్తం"—ప్రజాదరణకు పాత్రమైనందుకు, ఆనందంగా ఉంది నెల తిరిగేలోపల్నే - 3,200 ప్రతులూ చెల్లిపోయి, రెండవముద్రణను పొందే భాగ్యం ప్రజాసూక్తానికి దక్కించినందుకు తెలుగు పాఠకలోకానికి మరోసారి కృతజ్ఞతలు ప్రకటిస్తూ రెండవముద్రణను, అందిస్తున్నాం.

## తేటతెనుగు ఊటు సామెతల మాట

మొదటి ముద్రణ :

ఆలోచనా స్వేచ్ఛ దేశంలోని నిర్మాణాత్మక శక్తులకు దోహదం కల్పించే విధంగానూ, కళాసృష్టికి ప్రతిభావ్యుత్పత్తులు ప్రాతిపదికలు అయ్యే విధంగానూ, వ్యక్తిత్వ నిర్మాణం సామాజికాభ్యుదయంతో పెనవేసుకొని పోయే విధంగానూ, సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలు రూపొందాలి. అప్పుడే ప్రజాస్వామ్యవ్యవస్థ ప్రజాశక్తులకు ఉద్దీపనం కల్గించ గలుగుతుంది. మనిషిలో అంతర్లీనంగావున్న ప్రజ్ఞాప్రతిభల వికాసానికి అనువైన అవకాశాలేర్పడతాయని 'యువభారతి' విశ్వాసం. ఈ విశ్వాసం పునాదిగా కడచిన పదేళ్ళనుండి 'యువభారతి' భాషా ప్రసరణానికి, సాహిత్యాభ్యుదయానికి ఇతోధికంగా కృషిచేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు ఉత్తమ సాహిత్యాన్ని అందించి, అక్షరాస్యులలో సాహిత్యాసక్తిని పెంపొందించి పరస్పరావగాహనకు, సంస్కృతి పరిరక్షణకు దోహదం కల్పించాలని 'యువభారతి' పుస్తక ప్రచురణ, సదస్సులు, ఉపన్యాసమంజరి కార్యక్రమాలు, సాహిత్యపరమైన పోటీలు, వ్యాససంకలనాలు మొదలైనవి చేపట్టి, తెలుగుదేశంలోనేకాక యావద్భారత దేశంలోని తెలుగువాళ్ళ మన్ననలను పొందగలిగింది. తెలుగులోనేకాక విశ్వసాహిత్యం లోని మేలి భావాలను సరళ సుందరంగా అందించాలని సాహితీ వాహినీ పరంపరను ప్రారంభించి, యిప్పటికి పోతన 'మందారమకరందాల'ను ప్రచురించింది. 'వేసున్న వేదం' రాబోతున్నది. ద్వైమాస పత్రికను నిర్వహించి ఆయా కవులకు సాహిత్య ప్రక్రియలకు సంబంధించిన వివిధాంశాలను సరళంగాను, అందంగాను అందించాలని ప్రణాళిక సిద్ధంచేసింది. 'యువభారతి'తో సహకరిస్తున్న సాహితీమిత్రులకు ఉచితంగా అందజేయాలనే దృష్టితో యిప్పుడు 'ప్రజాసూక్తం' వెలువరిస్తున్నది.

ఈ 'ప్రజాసూక్తా'న్ని రచించింది ప్రజలు. ఏరుల పుట్టుక, మునుల పుట్టుక తెలియదన్నారు పెద్దలు. సామెతల పుట్టుకకూడ ఎవరికీ తెలియదు. నాటికర్త ఎవరో తెలియదు. కనుకనే వాటిని అపౌరుషేయాలు అని అనా, బాధలేదు. అవి వేదాలవలెనే ఒక తరం మరొక తరానికి అందిస్తుంటే రాతపూతలకు నోచుకోక, జనసామాన్యం నోళ్ళల్లో భద్రంగా వుంటూవున్న భాషా సంపద. సామెతను సృష్టించది వున్నట్టుగా వాడుకుంటేనే అందం. తమకు ఇష్టంవచ్చిన మార్పులు చేస్తే అనర్థాన్ని లేస్తాయి.

ఒక లక్షణంతోపాటు పెదాలకు వస్తుంది. కనుకనే 'ప్రజాసూక్తం' అన్నాం. తన అనుభవాన్ని ఏ జానపదుడో, పండితుడో భావావేశంలో అనివుంటాడు. భావావేశంలో వెలువడినవి కావట్టే, వాటిలో లయవుంది. విన్నప్పుడు చెవికి హాయినిగొలిపే శబ్దసౌందర్యమూ వుంది. అందరికీ అర్థంఅయ్యే భాషావుంది. నిర్భరమైన సంక్షిప్తత వుంది కనుకనే అవి సూటిగా తుపాకిగుండువలె గుండెకు తాకుతాయి. వాటికి వ్యాఖ్యానం అక్కరలేదు. ప్రజల అనుభవాలకివే అందమైన వ్యాఖ్యానాల వంటివి కనుక ఇవి సహజంగానూ, సరళంగానూ, సుందరంగానూ వుంటాయి. జనసామాన్యం నోళ్ళకెక్కి రాళ్ళా రోకళ్ళా పాడుతాయి. సామెతలు ప్రజల ఆచారవ్యవహారాలను, కష్టసుఖాలను, నిట్టూర్పులను, చరిత్రను తెలుపుతాయి. మహాకావ్యాల్లో చోటు సంపాదించుకొని ఆ కావ్యాల విలువను హెచ్చిస్తాయి. ఎంతో పెద్దకథను ఒక్కొక్కసారి మూడు మాటల్లో ముచ్చటగా చెప్తాయి. చాలా సందర్భాల్లో భావప్రకటనకు దోహదం కల్గిస్తాయి. ఒక్క సామెతైనా రానివాడు నిజంగా ఒకరకంగా మూగవాడే. యతైనా, ప్రాసైనా యీ సామెతల్లో వుంటుంది. కొన్నిచోట్ల రెండూ వుంటాయి. యతిప్రాసలు సహజమైనవి కావని వాదించేవాళ్ళు సామెతల సంగతి తెలియనివాళ్ళే అనుకోవాలి.

ఈ సామెతలు సామాజిక జీవనంతోపాటు పయనించి ఇతర భాషల్లోకి ప్రవేశిస్తాయి. మన భారతదేశంలోని అన్ని భాషల్లోని సామెతలను సంతరించి పోల్చిచూస్తే వాటిలో ఏకాత్మ భాసిస్తుంది. మన పురాణ గాథలన్నీ సామెతలుగా రూపొందాయి. మనసామాజిక జీవనానికి సామెతలు దర్పణం పట్టినవి. ఆయుర్వేద జ్యోతిర్వేదాది శాస్త్రాల రహస్యాలు పామరులు అర్థంచేసుకొని ప్రచారం చేసిన తీరుతెన్నులు వీటిలో కన్పిస్తుంటాయి. ఇక వ్యవసాయ ప్రధానమైన మన జాతీయ జీవితంలోని ఎన్నో అంశాలకు యీ సామెతలు సంకేతాలుగా నిలిచాయి. 'యువభారతి' యీ సామెతలను ఏర్చికూర్చి ప్రజలకందిస్తున్నది. ఈ ఏర్పు కూర్పులన్నీ మా 'యువభారతి' ప్రధాన సంపాదకులూ, మా గౌరవ సభ్యులూ డాక్టరు జి. వి. సుబ్రహ్మణ్యంగారి నేతృత్వంలో జరిగినవి. ఈ విధంగా 'ప్రజాసూక్తం'రూపకల్పనకు తోడ్పడిన డాక్టరు సుబ్రహ్మణ్యంగారికి మనఃపూర్వకంగా అభివందనలను సమర్పిస్తున్నాము.

స్వల్పవ్యవధిలో 'ప్రజాసూక్తా'న్ని అందంగా అచ్చువోసి అందించిన 'విజయశ్రీ ప్రింటింగ్ వర్క్సు' అధినేతలు శ్రీ ఏ. సూర్యనారాయణగారికి మా నమస్సులు.

ఈ 'ప్రజాసూక్తా'న్ని తెలుగు ప్రజలు సమాదరిస్తారని విశ్వసిస్తున్నాము.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు.
యువ భారతి

2-12-1973




# యువభారతి పరిచయము

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం, పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం కలుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

ఆలోచనా స్వేచ్ఛ జాతిప్రగతికి, దేశపురోగతికి దోహదం కలిగించే విధంగానూ, కళాసృష్టికి ప్రతిభా వ్యుత్పత్తులు ప్రాతిపదికలు కాగలిగే విధంగానూ, వ్యక్తిత్వ నిర్మాణం సాంఘికాభ్యుదయంతో పెనవేసుకొనిపోయే విధంగానూ, సాహిత్య సాంస్కృతిక కార్యకలాపాలను సజీవజాతి నిర్వహించుకుంటుంది. ప్రజాస్వామ్య వ్యవస్థకు నారుపోసేవి ప్రతిభా సౌమనస్యాలే.

యువభారతి కడచిన పదేళ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషిచేస్తున్నది.

పక్షానికి ఒకమారు శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయంలో సాహిత్య సమావేశాలను ఏర్పరచి, యువభారతి తన సభ్యులకు సక్రమంగా ఆలోచించే పద్ధతిని, అందంగా, శక్తివంతంగా, అర్థవంతంగా మాట్లాడగలిగే సామర్థ్యాన్నీ, నైపుణ్యాన్నీ ఎదుటివారి అభిప్రాయాలను సహనంతో వినే సహృదయాన్నీ, ఆలోచన రేకెత్తించి, వివేకాన్ని ఉద్దీపింపచేయగలిగే అధ్యయన శీలతనూ అలవరచేందుకు విశద దృక్కోణాలతో రూపొందించిన కార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని ప్రజానీకానికి అందిస్తే సాహిత్యంపట్ల అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ పూర్వవిరాళపద్ధతిని ప్రవేశపెట్టి సరస్వతీ సాక్షాత్కారం, జీవనగీత, కావ్యలహరి, చైతన్యలహరి, వికాసలహరి, వంటి సాహితీతపోమూర్తుల సందేశాల నందించే గ్రంథాలను వేనవేల సంఖ్యలో ప్రచురించి, ఉభయనగరాలలోని రసికులనేకాక యావద్భారత దేశంలోని సాహితీప్రియుల మన్ననలను పొందగలిగింది. 'మారుతున్న విలువలు–రచయితల

బాధ్యతలు' అనే ఒక గోష్ఠిని నిర్వహించి, ఆ గోష్ఠి వ్యాసాలను 'రచన'గా ప్రచురించింది. భారత స్వాతంత్ర్య రజతోత్సవ సందర్భంగా గడచిన 25 ఏళ్ళలో తెలుగుదేశంలో సాంస్కృతిక సాహిత్య భాషా సంబంధమయిన తీరుతెన్నులను వివరిస్తూ నూరుగురు ప్రముఖుల వ్యాసాల సంపుటిని 'మహతి'గా ప్రచురించింది.

భారత దేశంలో ఎక్కడున్నా సరే—యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకోగలిగేందుకు రసికులకు సాహితీమిత్ర పథకాన్ని రూపొందించింది. ఇప్పటికి దాదాపు 5 వేలమంది సహృదయులు సాహితీమిత్రులుగా చేరినారు. ఈ సాహితీమిత్రుల సాహితీ వికాసానికి తోడ్పడేందుకు ఒక కవితా సంకలనం 'ఉషస్సు'ను, 'కథావాహిని' అనే రెండు కథాసంకలనాలను ప్రచురించింది. యువభారతి సభ్యుల కవితా, కథా సంకలనాలు 'వీచికలు–అక్షరాలు–స్వరాలు–ఉదయం' కూడా వెలువడినవి.

యువభారతికి మూలనిధి ఏర్పరచిన దానివల్ల వచ్చే ఆదాయంతో ఈ సాహిత్య కార్యక్రమాలను మరింత సుస్థిరంగా, ప్రయోజనాత్మకంగా, విస్తృతంగా, నిర్దుష్టంగా నిర్వహించాలనే ఉద్దేశ్యంతో 'భారతీమిత్ర', 'భారతీభూషణ' పథకాలను రూపొందించినాము.

జంటనగరాలలో వేనవేల సంఖ్యలో భాషాభిమానులను ఆకర్షించి, పెద్ద ఎత్తున సాహిత్య సభలను యువభారతి నిర్వహించ గలిగింది. తెలుగు సాహిత్యం గురించి తెలుగువారికి తెలుపడమేకాదు, అన్యభాషీయులకు కూడా తెలుపబూనుకోవడంలో ఔచిత్యముందని అలాగే అన్యసాహిత్య సంస్కృతుల విశేషాలను తెలుగువారు తెలుసుకోవలసిన అవసరం ఎంతయినా ఉందని మా విశ్వాసం. దీనికి నాందిగా 34 ఇంగ్లీషు వ్యాసాల సంకలనం 'Free India Forges Ahead'ను వెలువరించింది.

బమ్మెర పోతన భాగవతంలోని యాభై రెండు పద్యాలను 'మందార మకరందాలు'గా మహాకవి డా॥ సి. నారాయణరెడ్డిగారి కమనీయ వ్యాఖ్యతో ప్రచురించి, లక్షప్రతులు అందించాలనే సంకల్పంతో మొదటిముద్రణ 25 వేల ప్రతులను ఒక రూపాయికే అందించి, రెండవ ముద్రణకు పూనుకుంది. మన తెలుగులోనే కాకుండా విశ్వ సాహిత్యాన్ని తమ ప్రతిభా ప్రభావాలతో సంపన్నం చేసిన మహనీయుల సందేశాలనుకూడా 'సాహితీవాహిని' పరంపరలో వెలువరించాలని, ద్వైమాసిక పత్రికగా ఈ 'సాహితీవాహిని'ని నిర్వహించి ఒక్కొక్క సంచికలో ఒక్కొక్క కవినో, సాహిత్య ప్రక్రియనో, విజ్ఞాన విషయాన్నో తెలుగు పాఠకలోకానికి అందించాలని ప్రణాళిక రూపొందించినాము.

నూరేళ్ళ తెలుగు నవల ప్రపంచ సాహిత్యానికి అందించిన కానుకగా చిరకాలం నిలువ గలిగే దాదాపు 22 నవలలను గురించి సాహిత్యాత్మక పరిచయ వ్యాసాలను ఇంగ్లీషులో వ్రాయించి 'Telugu Novel'గా 1974లో ఆనంద ఉగాదినాడు వెలువరించనున్నది. ఆనంద ఉగాదినాడు 'సాహితీవాహిని'లో రెండవ తరంగంగా 'వేమన్న

వేదం'ను వెలువరించనున్నది. 1974 లో 'యువత' గోష్ఠిని నిర్వహించడానికి ప్రణాళిక సిద్ధం చేసింది. దేశంలో యువకులు నిర్వహించిన, నిర్వహిస్తున్న, నిర్వహించవలసిన పాత్రను గూర్చి సమగ్ర పరిశీలన ఈ గోష్ఠి లక్ష్యం. దాదాపు 10 వ్యాసాల సంకలనం కూడా 'యువత' అనే పేరుతో గోష్ఠి వ్యాససంకలనంగా వెలువడుతుంది.

ఉడుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు, వారి సౌహార్దం, భాషాప్రియత్వం, ఇదే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయన శీలతా, సౌజన్యం, పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు

2-12-1973

యువభారతి




'సాహితీవాహిని'లో
రెండవ తరంగం

*

వేమన్న సూక్తుల్లో
మిన్నికైన
కొన్ని మౌక్తికాలు

ఆవిష్కరణ:

'ఆనంద' ఉగాది
**24-3-1974**

వెల: రూపాయే!
పోస్టేజి 0-25 అదనం

**త్వరపడి
మీ కాపీని సొంతం
చేసుకోండి!**



## యువభారతి పక్ష సమావేశాలు



యువభారతి, ప్రతినెలా
మొదటి ఆదివారం, మూడవ ఆదివారం
సుల్తాన్ బజారులోని
శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో
మధ్యాహ్నం 2-30 గం॥లకు సమావేశమవుతుంది.
సహృదయులందరూ ఆహ్వానితులే।





# ప్రజాసాహిత్యం

తెలుగు సామెతలు

## అ

"అ ఆ"లు రావు, అగ్రతాంబూలం మాత్రం కావాల !
అంకెలేనికోతి లంకంతా చెఱచిందట.
అంగట్లో అరువు; తలమీద బరువు !
అంగట్లో ఎక్కువైతే ముంగిట్లోకి వస్తుంది.
అంగట్లో బెల్లానికి గుళ్ళోలింగానికి నైవేద్యం.
అంచుడాడేకాని, పంచెడాబు లేదు.
అంటే ఆరడి అవుతుంది, అనకుంటే అలుసవుతుంది.
అండలుంటే కొండలుదాటవచ్చు.
అంత ఉరిమి ఇంతేనా కురిసేది ?
అంతా తెలిసినవాడులేడు, ఏమీ తెలియనివాడూలేడు.
అంత్యనిష్ఠురంకన్నా ఆదినిష్ఠురం మేలు.
అందం చిందినట్లు నాగరకత నష్టమైనట్లు.
అందముంటె ఆయెనా ? అదృష్టము ఉండవద్దా ?
అందని మానిపండ్లకు అఱ్ఱులు సాచినట్లు.
అందఱికి శకునం చెప్పేబల్లి, తానుపోయి కుడితిలో పడ్డట్టు.
అందఱికీ అన్నంపెట్టేవాడు రైతే !
అందఱినీ మెప్పించడం అలవిగానిపని.
అందఱూ అందలమెక్కితే, మోసేవారెవరు ?
అందానికి పెట్టినసొమ్ము ఆపదకు అడ్డంవస్తుంది.
అంబలి తాగేవాడికి మీసాలెగబెట్టేవాడొకడు.
అకటా వికటపురాజుకు అవివేకి ప్రధాని, చాదస్తపు పరివారము.
అక్కచెల్లెళ్ళకు అన్నంపెట్టి లెక్కవ్రాసినట్లు.
అక్కఱకు ఒదవని అర్థమెందుకు ? అక్కఱకురాని చుట్టమెందుకు ?
అక్కఱకు వచ్చినవాడే అయినవాడు.
అగ్రహారం పోతే పోయిందికాని, ఆకట్టు అంతా బాగా తెలిసింది.
అగ్గిచూపితే వెన్న అడక్కుండా కరుగుతుంది.
అగ్గువ అయితే అంగడికి వస్తుంది.

అగ్గువ అయితే అందరూ కొంటారు.
అచ్చిపచ్చిన ఘాటు అడుగేచాలు.
అచ్చోసిన ఆబోతులాగ.
అటుకులు బొక్కేనోరు, ఆడిపోసుకునేనోరు ఊరుకోవు.
అడక్కుండా చెప్పులిచ్చాడు, అడిగితే గుఱ్ఱమిస్తాడని అనుకొన్నట్లు.
అడవిపంది చేను మేసిపోతే, ఊరపంది చెవులు కోసినట్లు.
అడవిని గాచిన వెన్నెల, ముదిమిని చేసిన పెండ్లి.
అడిగితే చిరాకు, అడుగకపోతే పరాకు.
అడిగినట్లు యిస్తే, కడిగినట్లు పోతుంది.
అడిగేవాడికి చెప్పేవాడు లోకువ.
అడియాస, పొడియాస దుఃఖానికి కారణం.
అడుక్కొని తినేవాళ్ళకు అరవై ఊళ్లు.
అడుగు తప్పితే పిడుగు తప్పుతుంది.
అడుగున ఎరువుకొద్దీ పైన బంగారం.
అడుసు త్రొక్కనేల? కాలు కడుగనేల?
అడ్డబొట్టువాడు నిలువుబొట్టువాడు తగవులాడి, సత్రం తగులబెట్టినట్లు.
అడ్డాలనాడు బిడ్డలుగాని, గడ్డాలనాడు బిడ్డలా?
అతికించిన కోరమీసం అట్టే నిలుస్తుందా?
అతిపరిహాస్యం బట్టబయలు.
అతివినయం ధూర్తలక్షణం.
అతుకులబొంత గతుకులబాట.
అత్తకాలము కొన్నాళ్ళు, కోడలికాలం కొన్నాళ్ళు.
అత్త చేసిన పనికి ఆరళ్ళు లేవు.
అత్తలేనికోడలుత్తమురాలు, కోడలులేనత్త గుణవంతురాలు.
అత్తసొమ్ము అల్లుడికి ధారవోసినట్లు.
అదను ఎఱిగి సేద్యం, పదును ఎఱిగి పైరు.
అదిగో పులి అంటే, ఇదిగో తోక అన్నట్లు.
అదునుచూచి పొదలో చల్లినా పండుతుంది.
అదృష్టం చెప్పిరాదు, దురదృష్టం చెప్పిపోదు.
అదృష్టం పండితే, ఆరు సూరపుతాయి.
అదృష్టం అందలమెక్కిస్తానంటే, బుద్ధి బురదలోకి లాక్కెళ్ళిందట

అదే ఊరైతే, రోళ్ళు రాయవా?
అద్దద్ద అనేవాడికి అర్ధరూపాయి; మొద్దుకొట్టేవానికి పెద్దదుడ్డు.
అద్దెకు వచ్చిన గుర్రాలు అగడ్తలు దాటుతవా?
అధికారికి చెవులుంటాయిగాని, కళ్లుండవు.
అనగా అనగా రాగం, తినగా తినగా రోగం.
అనిపించుకోవలెనా అత్తగారు? అన్నట్లు.
అనిత్యాని శరీరాణి, అందరిసొమ్ము మనకేరాని.
అనుభవమే శాస్త్రం, మాటలే మంత్రాలు.
అనువుగానిచోట అధికులమనరాదు.
అన్నం వుడికిందో లేదో, అంతా పట్టి చూడనక్కరలేదు.
అన్నదీక్షయేకాని, అక్షరదీక్షలేదు.
అన్నదేవర సన్నదిస్తే, అన్నీ అణుగుతవి.
అన్నము అరఘడియలో అరుగుతుంది, ఆదరణ శాశ్వతంగా ఉంటుంది.
అన్నవారుబాగున్నారు, పడినవారుబాగున్నారు, నడుమ ఉన్నవారే నలిగిపచ్చారు.
అన్నీ అమర్చిన తరువాత అత్తగారు వేలుపెట్టినట్లు.
అన్నీ ఉన్నవిస్తరి అణగిమణగి ఉంటుంది, ఏమీలేనివిస్తరి ఎగిరెగిరి పడుతుంది.
అన్నీతెలిసినమ్మ అమావాస్యనాడుచస్తే,ఏమీతెలియనమ్మ ఏకాదసినాడుచచ్చింది.
అన్నీ పండించిన రైతుకు అన్నమే కరువు.
అన్నేసి చూడు, నన్నేసి చూడు.
అన్యాయపు ఊరిలో ఆలూమొగుడికే అంకు.
అన్యాయపు సంపాదన అనర్థాలంగా పోతుంది.
అప్పటి కోపము అన్యాయమెరుగదు.
అప్పళాచారివారి సన్నిధిలో అపశబ్దాలకు భయంలేదు.
అప్పు ఇచ్చినవాడు బాగు కోరును, తీసుకున్న వాడు చెడుగోరును.
అప్ప ఉబ్బి చచ్చింది, బావ ఎండి చచ్చాడు.
అప్పుచేసి కొప్పుతీర్చిందట.
అప్పుచేసి చెడును, చెట్టెక్కి చేయి విడిచి చెడును.
అప్పుచేసి పప్పుకూడు.
అప్పులేనిదే ఒక ఐశ్వర్యం.
అప్పుతీర్చి అంగట్లో కాపురం చేయాలి.
అప్పులున్నవాడివెంట, చెప్పులున్నవాడివెంట పోరాదు.

అబద్ధం చెబితే, నిజం చెప్పేవాడికంట్లో కారం కొట్టినట్లుండాలి.
అబద్ధం చెప్పతావేమిరా? వేన్నీళ్ళబిందెలో ఏడు కొరమీన్లు ఉంటే.
అబద్ధాల పంచాంగానికి అరవై ఘడియలు త్యాజ్యం.
అమ్మ తా పెట్టాపెట్టదు, అడుక్కు తినానివ్వదు.
అమ్మయినా అడగందే పెట్టదు.
అమ్మా! నీ అల్లుడు వచ్చాడంటే, నన్నేమి చేస్తాడమ్మా!
నిన్నే తీసికెళ్తాడన్నట్లు.
అమరము నెమరుకువస్తే కావ్యాలెందుకు కాల్చనా?
అమ్మాయి పుట్టింది అంటే, ఆయువు సగం కుంగింది అన్నమాటే!
అయ్యే సామెల్ల ఇంట్లోనే!
అయినవారు లోతుకు తీస్తే, కానివారు మిట్టకు తీస్తారు.
అయిపోయిన పెళ్ళికి మేళం ఎందుకు?
ఆయుష్యం గట్టిగా వుంటే, ఆడవిలో వున్నా, అయోధ్యలో ఉన్నా ఒకటే.
అరచేతిలో ఉసిరికాయవలె.
అరగడియ భోగం, ఆరునెలలరోగం.
అరగదీసిన గంధపుచెక్కకు వాసన తగ్గునా?
అరగని కూడు, జరగని మాట.
అరటాకుమీద ముల్లుపడ్డా, ముల్లుమీద అరటాకుపడ్డా, అరటాకుకే ముప్పు.
అరటిచెట్లు రెండుసార్లు గెలవేయునా!
అరవై అరు పిండివంటలూ ఆవు చంటిలోనే ఉన్నాయి.
అరవై ఊళ్ళకు అమలుదారు ఆలికి దాసుడు.
అరవై ఏండ్లు నిండినవాణ్ణి ఆలోచన అడక్కు,
ఇరవై ఏండ్లు నిండనివానికి పెత్తనమీయకు.
అరుంధతీ గిరుంధతీ కనపడుటలేదు కాని,
ఆరువందలు అప్పుమాత్రం కనపడుతున్నది.
అర్థబలంకంటె అంగబలం ఎక్కువ.
అర్జీలకు పనులుకావు, ఆశీర్వచనాలకు బిడ్డలు పుట్టరు.
అలకాపురం కొల్లగొట్టినా అదృష్టహీనుడికేమీ దక్కదు.
అల్పవిద్వాంసుడు ఆక్షేపణకు పెద్ద.
అలవి మీరితే అదృష్టమైనా విషమే.
అలికినయింట ఒలికినా అందమే.

అల్పుడికి ఐశ్వర్యం వస్తే, అర్ధరాత్రి గొడుగు పట్టమన్నాడట.
అల్లమంటే తెలియదా బెల్లంమాదిరి పుల్లగా ఉంటుంది అన్నాడట.
అల్లుడికి చేసినపప్పు, అతిథికికూడ పనికివచ్చినట్లు.
అవ్వకావాలి ! బువ్వాకావాలి.
అశ్వత్థ ప్రదక్షిణం చేసి, కడుపుపట్టి చూచుకున్నట్లు.
అసలేకోతి, దానికితోడు కల్లుతాగింది ; ఆపైన తేలుకుట్టింది.
అస్తమానం అరిచేపిల్లి ఎలుకల పట్టలేదు.

ఆ వూరికి ఈ వూరు ఎంతదూరమో, ఈ వూరికి ఆ వూరు అంతేదూరం.
ఆకలి అయినవాడు ధర చెడకొడతాడు.
ఆకలి ఎక్కువని రెండు చేతులతో తిన్నట్లు.
ఆకలిగొన్న కరణము పాతపవిలె తీశాడట.
ఆకలి రుచి ఎరుగదు, వలపు సిగ్గెరుగదు.
ఆకలిగొన్నవానికి అనుష్టుప్శ్లోకాలతో కడుపు నిండుతుందా ?
ఆకారం చూసి ఆశపడ్డానేగాని, అయ్యకు అందులో పసలేదు.
ఆకారపుష్టి, నైవేద్యనష్టి.
ఆ గొడ్డు మంచిదయితే, ఆ ఊళ్ళోనే అమ్ముడుపోతుంది.
ఆచార్యుడికి ద్రోహం చేసినా, ఆత్మకు ద్రోహం చేసికోరాదు.
ఆడదాని బ్రతుకు అరటాకు వంటిది.
ఆడదాన్ని చూచినా, అర్ధాన్ని చూచినా, బ్రహ్మకైనా పుట్టు జిమ్మతెగులు.
ఆడపిల్ల పుట్టినపుడే ఆధరవు పుడుతుంది.
ఆడలేక అంగణం వంకర అన్నట్లు.
ఆత్మస్తుతీ, పరనిందా, అర్థాపేక్షలేని మహానుభావుడికి నాకూడబ్బు,
శుద్ధమంతకు వాడికీ డబ్బా ?
ఆడబోయిన తీర్థ మెదురాయెనట్టులు.
ఆదర్శాలు శిఖరమెక్కి కూర్చుంటే, అవసరాలు అగాధంలోకి ఈడుస్తాయి.
ఆ దారి ఎక్కడికి పోతుంది అంటే, ఎక్కడకీపోదు,
నేను పుట్టినది మొదలు ఇక్కడనే ఉంది అన్నట్లు.
ఆపదకు పాపంలేదు.
ఆపద మ్రొక్కులు, సంపద మఱపులు.

ఆపదలో అడ్డుపడేవాడే చుట్టము.
ఆపదలు దూరమైతే, అంతఃకరణాలు దూరమౌతవా ?
ఆముదపువిత్తులు ఆణిముత్యాలగునా ?
ఆమెపేరు కుంతలమ్మ, చూడబోతే బట్టతల.
ఆరంభ శూరుడికి ఆర్భాటమెక్కువ.
ఆరిపోయే దీపానికి దీప్తి ఎక్కువ.
ఆరునెలలు సహవాసంచేస్తే, వారువీరవుతారు.
ఆర్భాటరసికుడొకడు, అనుభవ రసికుడింకొకడు, ఆలింగనరసికుడు మరొకడు.
ఆలికి అన్నం పెట్టడం ఊరికి ఉపకారమా ?
ఆవలివంకవారు ఆత్మబంధువులు, తల్లివంకవారు తగినవారు,
తండ్రివంకవారు దాయాదులు.
ఆలి పంచాయితీ రామాయణం, పాలి పంచాయితీ భారతం.
ఆలుకుదురైతే, చేను కుదురు.
ఆవాహనాలేదు, విసర్జనాలేదు.
ఆవు నలుపైతే పాలు నలుపా ?
ఆవుల మళ్ళించినవాడే అర్జునుడు.
ఆవులు ఆవులు కుమ్ములాడితే లేగలకాళ్ళు విరిగినట్లు.
ఆవూ, దూడా ఉండగా గుంజ అరచినట్లు.
ఆశకు అంతులేదు, నిద్రకు సుఖంలేదు.
ఆశకు ముదిమిలేదు, అర్థికిసౌఖ్యంలేదు.
ఆశ సిగ్గెఱుగదు, నిద్ర సుఖమెరుగదు.
ఆహారంపట్ల, వ్యవహారంపట్ల మొగమాటం పడరాదు.

## ఇ

ఇంగువ కట్టిన గుడ్డ, బెల్లం వండిన పొయ్యి.
ఇచ్చేవాడు తీసుకొనేవాడికి లోకువ.
ఇచ్చేవాణ్ణి చూస్తే, చచ్చేవాడైనా లేస్తాడు.
ఇచ్చేవానికి పత్రమువద్దు, చచ్చేవానికి మందువద్దు.
ఇంటికంటె గుడి పదిలం.
ఇంటికళ ఇల్లాలేచెబుతుంది.
ఇంటికి దీపం ఇల్లాలే !

ఇంటికి ఒకపువ్వు, ఈశ్వరుడికొకదండ.
ఇంటికి గుట్టు, మడికి గట్టు.
ఇంటిగుట్టు లంకకుచేటు.
ఇంటిదీపమని ముద్దుపెట్టుకుంటే, మీసాలన్నీ తెగకాలినవట!
ఇంటిదొంగను ఈశ్వరుడయినా పట్టలేడు.
ఇంటిపేరు కస్తూరివారు ఇంట్లో గబ్బిలాలకంపు.
ఇంటిపేరు క్షీరసాగరంవారు, ఇంట్లో మజ్జిగ చుక్కకు గతిలేదు.
ఇంట్లో ఈగలమోత, బయట పల్లకీలమోత.
ఇంట్లోదేవుణ్ణివదలి, వీధిలో దేవుణ్ణి మ్రొక్కినట్లు.
ఇంట్లోపిల్లి, బయటపులి.
ఇటువేస్తే హనుమంతుడు, అటువేస్తే వీరభద్రుడు.
ఇదిగో పులి అంటే, అదిగోతోక అన్నట్లు.
ఇద్దరు పెండ్లాల మగడు ఇరుకునపడి చచ్చెనట.
ఇనుము కరిగేచోట, ఈగలకు ఏంపని?
ఇనుము విరిగితే అతకవచ్చును. మనసువిరిగితే అతకలేము.
ఇన్ని కంతులు కోశానుగాని, నా కంతి అంతనొప్పి మరేదీలేదు.
ఇరుసున కందిపెట్టక, పరమేశ్వరుడి బండి అయినా పారదు.
ఇల్లలుకగానే పండుగవుతుందా?
ఇల్లు ఇరకటం, ఆలు మరకటం.
ఇల్లుకాలి ఏడుస్తుంటే, చుట్టకు నిప్పివ్వమన్నట్లు.
ఇల్లు కాలుతుంటే బావి తవ్వించినట్లు.
ఇల్లే తీర్థం, వాకిలే వారణాసి, కడుపే కైలాసం.
ఇంటగెలిచి రచ్చ గెలవమన్నారు.
ఇవ్వాళ గుర్రాన్ని ఎక్కడమెందుకు? రేపు గాడిదనెక్కడమెందుకు?
ఇష్టంతో ఇచ్చిందే ఈవి.
ఇష్టంలేని పెళ్ళాన్ని "ఒసే" అన్నాతప్పే! "అమ్మా" అన్నాతప్పే!
ఇసుకతో తాడు పేనినట్లు.
ఇస్తే చెడేదిలేదు, చస్తే వచ్చేదిలేదు.
ఇహం మన్ను, పరం పైడి.

## ఈ

ఈగను కప్పమింగితే! కప్పను పాముమింగును.
ఈగుడి నేను కట్టించలేదు, ఆగుడి ఎవరు కట్టించారో ఎరుగను అన్నాడట.

ఈటెపోటుకంటె మాటపోటు మానదు.
ఈడుచూచి పిల్లనియ్యి, పిడిచూచి కొడవలియ్యి.
ఈనగాచి నక్కలపాలు జేసినట్లు.
ఈనినపులి పైనబడినట్లు.
ఈనాడు ఇంటిలో, రేపు మంటిలో.
ఈవలిగట్టున ఉండే ఆవుకు ఆవలిగట్టు పచ్చన.

## ఉ

ఉండిచూడు ఊరు అందము, నానాటికీ చూడు నా అందము.
ఉట్టికి ఎగురలేని వాడు, స్వర్గానికి ఎగురుతానన్నట్లు.
ఉడుతల ఊపులకు మాకులు ఊగునా.
ఉత్తకుండకు ఊపులెక్కువ.
ఉద్ధతులమధ్య పేదలకుండతరమా ?
ఉద్యోగికి ఒక ఊరనిలేదు, ముష్టివానికి ఒక ఇల్లనిలేదు.
ఉన్నవూరు కన్నతల్లివంటిది.
ఉన్నదే మనిషికి పుష్టి, తిన్నదే పసరానికిపుష్టి.
ఉన్నమాట అంటే, ఉలుకెక్కువ.
ఉన్నవాడు ఉన్నవాడికే పెట్టును, లేనివాడూ ఉన్నవాడికే పెట్టును.
ఉపాయమున్నవాడు ఊరిమీద బ్రతుకుతాడు.
ఉపాయం లేనివాడు ఉపవాసంతో చచ్చాడు.
ఉపాయం లేనివాణ్ణి ఊళ్ళోనుంచే వెళ్ళగొట్టమన్నారు.
ఉప్పుతిన్న ప్రాణమూరుకోదు.
ఉప్పూలేదు, కారమూలేదు, అమ్మతోడు కమ్మగుంది.
ఉయ్యాలలో బిడ్డనుపెట్టి, ఊరంతా వెతికినట్లు.
ఉలిపికట్టె కేలరా ఊళ్ళో పెత్తనాలు ?
ఉల్లిని నమ్మి, తల్లిని నమ్మి చెడ్డవాడు లేడు.
ఉల్లి మల్లికాదు, కాకి కోకిలకాదు.
ఉల్లిచేసిన మేలు తల్లిఅయినా చేయదు.
ఉభయభ్రష్టత్వం ఉప్పర సన్యాసం.

## ఊ

ఊరంతా చుట్టాలు, ఉట్టికట్టుకోను చోటులేదు.
ఊరకున్నవాడే ఉత్తమయోగి.

ఊరకున్నవాడిని ఊరేమీ చేయలేదు.
ఊరకున్నవాడికి ఊహలురావు.
ఊరందరిదీ ఒకదారి ఉలిపికట్టెదొకదారి.
ఊరికే పెట్టేఅమ్మ, నీ మొగుడితోపాటు పెట్టమన్నట్లు.
ఊరికేవస్తే, మావాడు ఇంకొకడున్నాడు అన్నట్లు.
ఊళ్ళో అధికారమైనా వుండాల, ఊరంచు పొలమైనా ఉండాల.
ఊహలు ఊళ్ళేలుతుంటే, కర్మం కట్టెలుమోస్తున్నది.
ఊళ్ళేలనివారు రాజ్యాలేలుతారా?
ఊసరవెల్లివలె, రంగులు మార్చేవాడు.

## ఋ

ఋణశేషం, వ్రణశేషం, అగ్నిశేషం ఉంచరాదు.

ఎంగిలికి ఎగ్గులేదు, తాగుబోతుకు సిగ్గులేదు.
ఎండచే నీడ మెరయును.
ఎండిన ఊళ్ళగోడు ఎవడికి కావాలి, పండిన ఊళ్ళకు అందరూ ప్రభువులే.
ఎంత పండినా కూటికే, ఎంత వుండినా కాటికే.
ఎంత పెద్దగుమ్మడికాయైనా కత్తిపీటకు లోకువే.
ఎంతవారలైనా కాంతదాసులే.
ఎందరో మహానుభావాలు అన్నారు.
ఎక్కడవున్నావే కంబళీ అంటే, వేసినచోటనే గొంగళీ అన్నదట.
ఎక్కడయినా బావ అనుగాని, వంగతోటలో బావా. అనకు.
ఎక్కడ మేసినా, మనఇంట్లో పాలిస్తే చాలు.
ఎక్కడిదిరా ఈ పెత్తనం? అంటే, మూలనుంటే నెత్తినవేసుకున్నానన్నాడట!
ఎక్కడినీరూ పల్లానికే చేరుతుంది.
ఎక్కువ తెలివి ఏడ్పుల కారణం, తక్కువ తెలివి తన్నుల కారణం.
ఎగిరెగిరి దంచినా అంతేకూలి, ఎగరకదంచినా అంతేకూలి.
ఎత్తేవాడుంటే ఏకులబుట్టా బరువే.
ఎదుట లేకుంటే, ఎదలో ఉండదు.
ఎద్దైనా ఏడాదికి నేర్చును, మొద్దు ముప్పై ఏళ్ళకయినా నేర్వదు.
ఎద్దుకేమి తెలుసును అటుకులరుచి.
ఎముకలేని నాలుక ఏమయినా పలుకుతుంది.

ఎరువుల సొమ్ములు బరువులచేటు, తియ్యాపెట్టా తీపులచేటు,
అందులో ఒకటిపోతే అప్పులచేటు.
ఎరువు ఉంటే, వెఱ్ఱివాడూ సేద్యగాడే.
ఎరువులేని పొలము—వేగంలేని ఏరు.
ఎలుక ఎంత ఏడ్చినా, పిల్లి కనికరిస్తుందా ?
ఎవడి నోటికంపు వాడికి తెలియదు.
ఎవడు త్రవ్వుకున్న గోతిలో వాడే పడతాడు.
ఎవరి ఏడుపు వాళ్ళకే ఎదురు తగులుతుంది.
ఎవరికంపు వారికింపు.
ఎవరిపిచ్చి వారికానందం.
ఎవరికి పెట్టావే దండము? అంటే, మీలో బుద్ధిహీనుడికి అన్నదట.
ఎవరిపాపాన వాళ్ళుపోతారు.

## ఏ

ఏ కఱ్ఱన నిప్పుంటే ఆ కఱ్ఱే కాలును.
ఏ కాలు జారినా మోపుకే మోసం.
ఏకుతో తాకితే, మేకుతో మోదుతారు.
ఏటి ఒడ్డున చేను, చీటికి మాటికి భయం.
ఏటికి ఏటు, మాటకు మాట.
ఏటికి ఎదురీదినట్లు.
ఏటి వంక లెవరు తీరుస్తారు ?
ఏట్లోపారే నీరు ఎవరు తాగితేఏమి ?
ఏడు మారినా, ఈడు ముదిరినా, ఏమీ మారదు ఈలోకంలో.
ఏడు మెతుకులు తింటే ఏనుగంత సత్తువ.
ఏడ్చేదాని ఎడమ చేతిక్రింద, కుట్టేవాని కుడిచేతిక్రింద కూర్చోరాదు.
ఏడ్చేదాని మొగుడు వస్తే, నా మొగుడూ వస్తాడు.
ఏతాము పాటకు ఎదురు పాటలేదు.
ఏ దారి అంటే, గోదారి అన్నట్లు.
ఏ దేముడు వరమిచ్చినా, పెనిమిటి లేందే పిల్లలు పుట్టరు.
ఏనుగును చూచి కుక్కలు మొరిగినట్లు.
ఏనుగు రొంపిలో కూరుకుపోతే, కాకికిగూడా లోకువే.
ఏపాటు తప్పినా సాపాటు తప్పదు.
ఏ మందలో కట్టినా మన మందలో ఈనితే సరి.

ఏమిచేసి బ్రతుకుదునమ్మా అంటే, నోరుచేసుకు బ్రతుకు ఓడా! అన్నాడట
ఏమీలేనమ్మకు ఏతులు లావు, ఉన్నమ్మకు ఆశలు లావు.
ఏమీ లేనివానికి ఏతులు లావు, స్వాములవారికి జడలులావు.
ఏ యీకల పక్షి ఆ గుంపులోనే చేరుతుంది.
ఏ రాయి అయితేనేమి పండ్లూడ గొట్టుకొనడానికి?
ఏరు ఎన్ని వంకలుపోయినా సముద్రంలోనే పడుతుంది.
ఏరు దాటేవరకు ఎంగన్న, ఏరుదాటినాక సింగన్న.
ఏరు మూరెడు తీస్తే, కొలను బారెడు తీస్తుంది.
ఏరుకొని తినేపక్షికి, ముక్కున ముల్లు విరిగినట్లు.
ఏఱు ఎంతపారినా కుక్కకు గతుకు నీళ్ళే!
ఏఱుదాటి, తెప్ప తగుల బెట్టినట్లు.
ఏలడానికి ఊళ్ళు లేకపోవచ్చుకాని, ఎత్తుకు తినడానికి ఊళ్లులేవా?
ఏ వాడ చిలుక ఆ వాడ పలుకు పలుకుతుంది.
ఏ వేషం వచ్చినా, దివిటీవానికేచేటు.

## ఐ

ఐశ్వర్య దేవత హలంలోనే ఉంది.

## ఒ

ఒంటికంటె జంట మేలు.
ఒక కల గనగానే తెల్లవారుతుందా?
ఒక చెయ్యితట్టితే చప్పుడవునా?
ఒకడి పాటు, పదిమంది సాపాటు.
ఒకనాటి వేషానికి మూతిమీసాలు గొరిగించుకున్నట్లు
ఒక పాముచేత రెండుసార్లు కరిపించుకుంటామా?
ఒకరిదైతే ఓపినంత, తనదైతే తగరమంత.
ఒకేజోడు అందరికీ సరిపోవునా?
ఒక్క దెబ్బకు రెండు పిట్టలు.
ఒక్కొక్కరాయి తీస్తుంటే, కొండయినా తరుగుతుంది.
ఒళ్ళు వంగనివాడు దొంగలతో కలసినాడట!
ఒళ్లు వంగనివారికి ఊరు అచ్చిరాదు.

## ఓ

ఓడలు బండ్లవచ్చు, బండ్లు ఓడలవచ్చు.

ఓనమాలే ఉక్కులు, ఒకటిరెండే లెక్కలు.
ఓపనివాడు కోరినదీ, ఒంటరివాడు ఆడనిదీ లేదు.
ఓపనివారికి వద్దన్నవారే తల్లిదండ్రులు.
ఓరీ రజక చక్రవర్తీ! అంటే, అంతపెద్దపేరు మాకెందుకు దొరా! మీకే ఉండనీయండి అన్నాడట!

## ఔ

'ఔ'ననటానికి, కాదనటానికి అత్త అధికారంకాని, కోడలికేముంది?
ఔను-కాదు అనేమాట లెంతచిన్నవో, వాటిని అనడం అంత కష్టం.
ఔషధం కానిది అవనిలో లేదు.

కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా?
కంచెలేని చేను, కన్నతల్లిలేని బిడ్డ ఒకటి.
కంచె వేసినదే కమతము.
కంచే చేనుమేస్తే, కాపేమి చేయగలడు?
కంటికిరెప్ప, కాలికిచెప్పు.
కంటికి రెప్పలు పోయాక, కాటుక పూలు ఉంటే ఏమాయె?
కంటివంటి ప్రకాశంలేదు, ముంటివంటి ఆధారంలేదు.
కండ్లు ఉంటేనే కాటుక.
కండ్లు కావాలంటవి, కడుపు వద్దంటది.
కండ్లు పోయిన తరువాత సూర్యనమస్కారాలు.
కండ్లు మూయించవచ్చునుగాని, కలలు గనేటట్లు చేయగలమా?
కంతి బలపుకాదు, చింత తీరిక కాదు.
కందం చెప్పినవాడు కవి, పందిని పొడిచినవాడు బంటు.
కందకులేదు, చేమకులేదు, తోటకూరకు దురద ఎందుకు?
కందకులేని దురద కత్తిపీటకా?
కందెన వేయని బండికి కావలసినంత సంగీతం.
కంబళిలో తింటూ, వెంట్రుకలు ఏరినట్లు.
కంసాలివాని ఇంటికెడితే బంగారమంటదుగాని, కుమ్మరివాని ఇంటి కెడితేమాత్రం మట్టి అంటుకుంటుంది.
కట్టిన ఇంటికి వంకరలు చెప్పేవారు వెయ్యిమంది.
కట్టినవానికొక ఇల్లయితే, అద్దెకున్నవాని కన్నీ ఇండ్లే.
కట్టులేనిఊరు, గట్టులేని చెరువు.

కొప్పెవంత పొయ్యే తీరుస్తుంది.
కడచి బ్రతికినామని గంతులు వేయరాదు.
కడివెడు పాలకు ఒక్క మజ్జిగబొట్టు.
కడుపుకు పెట్టిందే కన్నతల్లి.
కడుపు కూటి కేడిస్తే, కొప్పు పూల కేడ్చిందట.
కడుపు చించుకుంటే, పేగులు కాళ్ళమీద పడును.
కడుపు చించుకున్నా. గారడీ విద్యే అన్నట్లు.
కడుపులో ఎట్లావుంటే, కాపురమట్లా వుంటుంది.
కడుపులోని మంట కానరాని మంట.
కడుపులో లేనిది కౌగిలించుకుంటే వస్తుందా ?
కత్తి తలగడకాదు, కల నిజంకాదు.
కత్తిపోటు తప్పినా, కలంపోటు తప్పదు.
కథ అడ్డం తిరిగింది.
కథ కంచికి మన మింటికి.
కదుర కవ్వము ఆడితే కఱవేలేదు.
కనిపెంచిననాడు కొడుకులుగాని, కోడళ్ల వచ్చాక కొడుకులా ?
కన్నీరు క్రిందకు కారుతుంది, పన్నీరు పైకిచిమ్ముతుంది.
కన్ను మనదే, వేలూ మనదేనని, పొడుచుకుంటామా ?
కన్నొకటి లేదుగాని, (కా)కంతుడు కాడా ?
కయ్యానికైనా, వియ్యానికైనా, నెయ్యానికైనా సమత వుండాలి.
కరక్కాయ కన్నతల్లి.
కరవమంటే కప్పకుకోపం, విడవమంటే పాముకు కోపం.
కరువుకు చింతలు, కాలానికి మామిళ్లు.
కరువుకు దాసరులైతే, పదాలెక్కడ వస్తాయి ?
కర్మ చండాలునికంటె, జాతి చండాలుడు మేలు.
కర్ణుడులేని భారతం, శొంఠిలేని కషాయం ఒకటే.
కర్ణునితో భారతం సరి, కార్తీకమాసంతో వానలుసరి.
కర్రు అరిగితేనే కాపు బ్రతుకు.
కలకాలపు దొంగ ఒకనాడు దొరుకును.
కలలో కాంత, నీటిలో నీడతో సమానం.
కలలో జరిగింది ఇలలో జరగదు.
కలలో భోగం, కలతోటే సరి.
కలిగినవాని కంపరూ చుటాలే.

కలిపి కొట్టరా, కావేటిరంగా.
కలిమి లేములు కావడి కుండలు.
కలుపు తీయని మడి, దేవుడులేని గుడి.
కలుపు తీయనివాడు కోత కోయడు.
కల్యాణానికి ఒకరు వస్తే, కన్నం వేయడానికి ఇంకొకరు వస్తారు.
కల్లాకపటం లేనివారికి కష్టాలు తప్పవు.
కల్యాణ మొచ్చినా కక్కొచ్చినా ఆగవు.
కల్ల పసిడికి కాంతిమెండు.
కర్రీ విత్తనం వెర్రిగాడెలు.
కళ్లు రెండున్నా, కనిపించే వస్తు వొకటే.
కవికి, కంసాలికి సీసం తేలిక.
కవితకు మెప్పు, కాంతకు కొప్పు
కష్టపడి ఇల్లుకట్టి, కల్లుతాగి తగులబెట్టినట్లు.
కష్టపడి సుఖపడ మన్నారు.
కష్ట సంపాదనము, ఇష్ట భోజనము.
కష్టాలు కలకాలం కాపురముండవు.
కసవు లేనిదే పశువు లేదు, పశువు లేనిదే పెంటలేదు, పెంటలేనిదే పంటలేదు.
పంటలేనిదే వంటలేదు.

కాంచనం కర్మ విమోచనం.
కాకినితెచ్చి పంజరంలో ఉంచితే, చిలుక పలుకు పలుకుతుందా?
కాకి ముక్కున దొండపండువలె.
కాగల కార్యం గంధర్వులే తీరుస్తారు.
కాచిన చెట్టుకే కఱ్ఱ దెబ్బలు.
కాటిదగ్గరి మాటలు కూటిదగ్గర ఉండవు.
కానవచ్చే కొండలను గట్టెక్కి చూడటం ఎందుకు?
కానుగ నీడ, కన్నతల్లి నీడ.
కానున్నది కాకమానదు, రానున్నది రాకమానదు.
కాపుల కష్టం, భూపుల సంపద.
కామిగాక మోక్షగామి కాడు.
కాలం పోతుంది, మాట నిలుస్తుంది.
కాలికి దూరమైతే కంటికి దూరమా?
కాలికి వేస్తే మెడకు, మెడకువేస్తే కాలికి.
కాలితో నడిస్తే కాశీకి పోవచ్చునుకాని,
తనతో నడిస్తే తలవాకిలి దాటవచ్చునా?

కాలు చేయి వున్నంతకాలం కాలం గడుస్తుంది.
కాలుజారితే తీసుకోగలం గాని, నోరు జారితే తీసుకోగలమా?
కాలువ దాటలేనివాడు కడలి దాటగలడా?
కాకిపిల్ల కాకికి ముద్దు.

కీడెంచి మేలెంచవలెను.
కీలెరిగి వాతబెట్టాల.

కుంటిసాకులు—కొంటె మాటలు.
కుండ ఎప్పుడువేటో, కుదురు అప్పుడేవేటు.
కుండను మూయను మూకుడున్నదిగాని, లోకుల నోరుమూయను ఏమున్నది?
కుండలదుమ్ము రోకళ్ళతో దులిపినట్లు.
కుండలు, చాటలు లేవని, వండుకతినటం మానుకుంటామా?
కుక్కకు ఏ వేషం వేసినా మొరగకమానదు.
కుక్కతోక చక్కనవుతుందా?
కుక్కతోక పట్టుకుని, గోదావరి ఈదినట్లు.
కుక్కను అమ్మితే, డబ్బు మొరుగుతుందా?
కుక్కలు బలిస్తే, గోనెలు మోస్తవా?
కుడితి కుండలోపడ్డ ఎలుకవలె.
కులంచెడ్డా సుఖం దక్కవలె.

కూటికుంటే కోటికున్నట్లు.
కూటిలోనిరాయి తీయలేనివాడు ఏటిలోనిరాయి తీయగలడా?
కూడబెట్టినవాడు కుడవనేర్చునా?
కూర్చుండి తింటూవుంటే, కొండఅయినా కరిగిపోతుంది.
కూర్చున్నవానికి కుప్పలు, తిరిగినవానికి తిప్పలు.
కూసే గాడిద వచ్చి, మేసే గాడిదను చెఱచిందట!

కృష్ణాస్నానానికి కొండుభొట్లాజ్ఞా?

కొంగ జపము చేపల కొఱకే.
కొండంత దూదికి కొండంత నిప్పెందుకు?
కొండంత దేవుడికి కొండంత పత్రి పెట్టగలమా?
కొండ అద్దమందు కొంచమై ఉండదా?
కొండకు ఒక వెంట్రుక ముడివేస్తే, వస్తే కొండేవస్తుంది,
పోతే వెంట్రుకే పోతుంది.

కొండలో తగదు ఓ కొన్నట్లు.
కొండనాలుకకు మందువేస్తే, ఉన్ననాలుకకాస్తా ఊడిపోయిందట.
కొండముచ్చితప్పి ఎలుకనుపట్టినట్లు.
కొడుకు మనవాడైతే, కోడలు మనదౌతుందా ?
కొత్త ఒకవింత, పాత ఒకరోత.
కొనగాతీరనిది, కొసరితే తీరునా ?
కొన్నది వంకాయ, కొసరింది గుమ్మడికాయ.
కొప్పున్నామె ఎటుతిప్పినా అందమే.
కొఱవితో తలగోకుకొన్నట్లు.

కోడలికి బుద్ధిచెప్పి, అత్త తెడ్డు నాకిందట.
కోతికి కొబ్బరికాయ దొరికినట్లు.
కోటకెక్కినవాడు, ఒకరు అప్పకొమ్మను, ఇంకొకరు తోకను పట్టుకుంటే, మధ్య ఒకేలు పొదుగు దగ్గర కూర్చుంటాడు.

## గ

గంగగోవుపాలు గంటెడే చాలు.
గంగలో మునిగినా కాకి హంస అవుతుందా ?
గంజిలోకి ఉప్పులేకుంటే, పాలలోకి పంచదారట.
గజమూమిథ్య, పలాయనమూ మిథ్య అన్నట్లు.
గడి శాస్త్రవేత్తలకు గజారోహణం వస్తుందా ?
గట్టిగా ఆయుష్యముంటే, గరిక నూరిపోసినా బతుకుతాడు.
గట్టు చేరిన వెనుక, పుట్టివానితో పోట్లాడినట్లు.
గడియ పురసత్తులేదు, గవ్వ ఆదాయంలేదు.
గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్.
గత జల సేతు బంధనము.
గతి చెడినా మతి చెడరాదు.
గతిలేనమ్మకు గంజేపానకం.
గటిక మేసిన గాడిద చస్తుందిగాని, గటిక చావదు.

గాడిదకు గడ్డివేసి, ఆవును పాలిమ్మన్నట్లు.
గాడిదకు తనకూత కమ్మగానే వుంటుంది.
గాడిదకు పులితోలు కప్పితే కటవగలదా ?
గాడిదకు భోగినీళ్ళుపోస్తే, బూడిదలో పొర్లాడిందంట.
గాడిదలతో సేద్యంచేస్తూ, కాలితన్నులకు దడిస్తేఎట్లా ?

గాడిద సంగీతానికి ఒంటె ఆశ్చర్యపడితే,
ఒంటె అందానికి గాడిద మూర్ఛపోయిందట.
గాలికిపోయిన కంపను కాలికి తగిలించుకొన్నట్లు.
గాలిని మూటకట్టినా గయ్యాళిపోరు కట్టలేడు.
గాలిలో మేడలు కట్టినట్లు.

గుడిదగ్గరైతే గురుత్వం దూరమవుతుంది.
గుడి మింగేవాడికి తలుపులు అప్పడాలు.
గుడిమింగేవాడొకడయితే, గుడిని లింగాన్ని మింగేవాడింకొకడు,
గుడిని గోపురాన్ని మ్రింగేది మరిఒకడు.

గుడ్డిఎద్దు చేలోపడ్డట్లు.
గుడ్డికంటికి పగలయితేనేమి? రాత్రయితేనేమి?
గుడ్డికన్న మెల్లమేలు.
గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినట్లు.
గుమ్మడికాయల దొంగ అంటే, భుజాలు తడుముకున్నట్లు.
గురువు నిలుచుండి తాగితే, శిష్యుడు పరుగెత్తుచూ తాగుతాడు.
గుఱ్ఱము గుడ్డిదయినా, దాణాకు తక్కువలేదు. (తప్పదు)
గుసగుసలువచ్చి గుడిసెకు దాడితెచ్చె.
గురిపెంద తన ముడ్డికింద నలుపెరుగదట.

గృహప్రవేశానికి వెడుతూ, గుడ్లగూబను చంకనపెట్టుకొని పోయినట్లు.

గొంతులో పచ్చివెలక్కాయ పడ్డట్లు.
గొడుగుపై గొడుగు పెట్టినా పిడుగుకు అడ్డమా?
గొడ్డలి ఎక్కడపెట్టినావురా? అంటే కొట్టే చెట్టుదగ్గిర;
కొట్టే చెట్టెక్కడుందిరా? అంటే గొడ్డలిదగ్గిర అన్నాడట.
గొప్పగ తెలిసినవారే, గోతిలో పడతారు.
గొర్రె ఎంత ఎదిగినా తోక బెత్తెడే.
గొర్రె కోసేవాణ్ణే నమ్ముతుంది.
గొర్రెల మందలో తోడేలు పడ్డట్లు.
గొళ్ళెంలేని తలుపు, కళ్ళెంలేని గుఱ్ఱము.

గోచికి ఎక్కువ, కోకకు తక్కువ.
గోచికి మించిన దరిద్రములేదు, ఈతకుమించిన లోతులేదు.

గోటితో పోయేపనికి గొడ్డలి ఎందుకు ?
గోడకు పూసిన సున్నము విడెములోనికి వచ్చునా ?
గోడనుపెట్టి తడక తన్నాలిగాని, తడక తన్ని గోడను పెట్టరాదు.
గోడమీది పిల్లివాటము.
గోడలకు చెవులుంటాయి, నీడలకు నోళ్ళుంటాయి.
గోధుమలు వేస్తే, బాదములు పండునా ?
గోముఖవ్యాఘ్రం.
గోరుచుట్టుపై రోకలిపోటు.
గోవును గోలెం దగ్గరికి తీసుకెళ్ళగలం గాని, కుడితి తాగించగలమా ?
గోవేతల్లి, ఎద్దేతండ్రి !
గ్రాసంలేని కొలువు, రసంలేని కావ్యం.

# ఘ

ఘడియకు హాజీ, ఘడియకు ఫాజీ.
ఘడియ తీరుబాటులేదు, దమ్మిడీ ఆదాయంలేదు.

# చ

చంకకు ఎక్కినపిల్ల చచ్చినా దిగదు.
చక్కనమ్మ చిక్కినా, చక్కనే. (అందమే)
చక్రవర్తి చేస్తే శృంగారం, చాకలిచేస్తే వ్యభిచారం.
చచ్చినపామును కొట్టడానికి అందరూ బంట్లే.
చచ్చేకాలానికి సత్యభామవేషం వేసినట్లు.
చదివింది, చదువనిది ఒకటిగా ఉండడమే పండితలక్షణం.
చదివినవాడికన్నా చాకలివాడు మేలు.
చదువాలేదు, మరువాలేదు.
చదువవేస్తే ఉన్నమతి పోయినట్లు.
చదువుకు ముదురు, సాముకు లేత.
చదువు, చన్నువిడిచి, చన్ను పట్టుకొనేలోపలే రావాల.
చదువు చేరెడు, బలపాలు దోసెడు.
చదువురానిమొద్దు, కదలలేని ఎద్దు.
చదువు సన్నమయ్యె, అయ్యలావయ్యె.
చమురుదండుగ భాగవతం.
చల్లకుండకు, చంటిబిడ్డకు చాటుండాలి.

చల్లకువచ్చి ముంత దాచనేల?
చవుక కొననివ్వదు, ప్రియము అమ్మనీయదు.
చచ్చినవాడికళ్ళు చారెడేసి.

చాకలి కొత్త, మంగలిపాత.
చాకలి తెలుపు, మంగలి నునుపు తప్ప, అయ్యదగ్గర ఏమీలేదు.
చాలని బట్టకొంటే చినిగేవరకు దుఃఖము,
చాలని మగని చేసుకుంటే చచ్చేవరకు దుఃఖము.
చాలుపై చాలుదున్నితే చచ్చుచేనైనా పండుతుంది.
చావుకంటే గండంలేదు, గోచికంటె దరిద్రంలేదు.
చావుకబురు చల్లగా చెప్పమన్నారు.
చావుకు చావు వున్నదా?
చావుకు పెడితేగాని, లంఖణాలకు తేలదు.
చావుతప్పి కన్ను లొట్టపోయినట్లు.

చింత చచ్చినా, పులుపు చావలేదు.
చింతలేనమ్మ సంతలో నిద్రపోయిందట.
చిక్కితే దొంగ, చిక్కకుంటే దొర.
చిక్కినవాడు సిగ్గెఱుగడు, బలిసినవాడు వావి ఎఱుగడు.
చిక్కిన సింహాన్ని బక్క కుక్కకూడా తఱుస్తుంది.
చిక్కుడుతీగకు బీరకాయ కాస్తుందా?
చిచ్చు అంటుకుంటే చేతులతో ఆర్పగలమా?
చిచ్చు ఉఱుకంగపోతూ, చీరకొంగు సవరించుకొన్నదానివలె.
చిచ్చును ఒడికట్టి తెచ్చినట్లు.
చితి చచ్చినవానిని, చింత బ్రతికినవానిని కాలుస్తుంది.
చిత్తం చెప్పులమీద, ధ్యానం దేవునిమీద.
చిత్తం మంచిదయితే, చేదూ మంచిదవుతుంది.
చిత్తరువునకు జీవంవచ్చినట్లు.
చిదంబర రహస్యం....! (ఆకాశలింగం ; ఏమీలేదని)
చినికి చినికి గాలివాన అయినట్లు.
చినుకులకు చెఱువు నిండునా?
చిన్నపామైనా పెద్దకర్రతో కొట్టవలె.
చిన్న పుల్లయినా పల్లుగుచ్చ పనికివస్తుంది.
చిన్నవాళ్లుతింటే చిరుతిండి, పెద్దవాళ్లుతింటే ఫలహారం.
చిన్నినా పొటకు శ్రీరామరక్ష.

చిలుం వదిలితేగాని, ఫలం దక్కదు.
చిలుక తనముద్దేగాని? ఎదుటిముద్దు కోరదు.
చిలుకపోతే పంజరమెందుకు ?
చిల్లర దేవతలకు మొక్కి, చిత్తం చెడగొట్టుకున్నట్లు.
చిల్లర శ్రీమహాలక్ష్మి.

చీకటిచేత వెలుతురు రాణిస్తుంది.
చీటికి ప్రాణంవ్రాలు.
చీడ సిగ్గెరుగదు.
చీదితే ఊడే ముక్కు తుమ్మితే నిలుస్తుందా ?
చీమ ఒళ్ళు చీమకు బరువు, ఏనుగుఒళ్ళు ఏనుగుకు బరువు.
చీమలు పెట్టిన పుట్టలు పాములకే.
చీరపోతు లేరివేయటంకన్న ? బొంతను కాల్చివేయటం నిష్కళం.
చీర సింగారించేటప్పటికి పట్నమంతా చూరపోయిందట !
చీలమడిమలదాకా చీరవుంటే, మోకాలుదాకా సిరి వుంటుందనుకున్నట్లు.

చుట్టతాగి చూరులో పెడితే, ఇల్లుకాలి పెళ్ళవలసి వచ్చిందట.
చుట్టమై చూడవస్తే దయ్యమై పట్టుకున్నాడట.
చుట్టాలకు పెట్టినిల్లు చూలపోయింది, వేల్పులకు పెట్టినిల్లు హెచ్చిపోయింది.
చుట్టు అయినా, మెట్టుదారిమేలు.

చూచిరమ్మంటే పెండ్లాడివచ్చినట్లు.
చూచిరమ్మంటే కాల్చి వచ్చాడట.
చూచేవారుంటే సొమ్ములు పెట్టాలి, చేసేవారుంటే పిల్లలు కనాలి.
చూడబోతే చుట్టాలు, రమ్మంటే కోపాలు.
చూపితే మానం పోయె, చూపకపోతే ప్రాణం పోయె.
చూపులపసేగాని, చేపులపసలేదు.
చూస్తూ ఊరుకుంటే, మేస్తూ పోయిందట.
చూస్తే చుక్క, లేస్తే కుక్క.
చూస్తేనీది, చూడకుంటేనాది.
చూరుకత్తి తెగుతుందికాని, చూపుడుకత్తి తెగుతుందా !

చెట్టు ఎక్కేవానికి ఎంతదాకా ఎక్కుడు పెట్టగలము.
చెట్టు ఎక్కించి, నిచ్చెన తీసినట్లు.
చెట్టుకు మడిగుడ్డ కట్టివున్నదిలే, దొంగ చెట్టెక్కడు అన్నాడట సోమిదేవమ్మ.
చెటు చచ్చినా చేవ చావదు.

చెట్టుచెడే కాలానికి కుక్కమూతి పిందెలు పుట్టును.
చెట్టు నాటిపెట్టినవాడు నీళ్లు పోయడా?
చెట్టు నాటేదొకడు, ఫలమనుభవించే దొకడు.
చెట్టుపీడకుపోతే కొమ్మవిరిగి పడ్డట్టు.
చెట్టుపేరు చెప్పుకొని కాయలమ్ముకున్నట్లు.
చెట్టుమీదిది చేతికి వచ్చినట్టేగాని, ఇక లొమ్మిదయితే పదవుతాయి.
చెట్టులేని చేను, చుట్టములేని ఊరు.
చెట్టులేనిచోట ఆముదపుచెట్టే మహావృక్షము.
చెట్టెక్కి చేతులు విడిచినట్లు.
చెడిన కాపురానికి మురిపెమిటి? చంద్రకాంతలు వండే పెండ్లామా!
అంటే, అయిన అప్పుకి అంతేమిటి? అవే వండుతాను మగడా! అన్నదట.
చెడిన చేనుకి మురిపెమిటి, మొండికాలికి చెప్పేమిటి!
చెడి స్నేహితునింటికిపోవచ్చును గాని, చుట్టాలింటికి పోరాదు.
చెడుకాలానికి చెడుబుద్ధులు.
చెడు చెడు మనేవారేగానీ, చేతిలో పెట్టేవారు లేరు.
చెప్పటం తేలిక, చేయడం కష్టం.
చెప్పింది చేయబోకురా! చేసేది చెప్పబోకురా!
చెప్పు కింద తేలువలె.
చెప్పటకంటె చేయటం మేలు.
చెప్పు, పట్టుగుడ్డలోచుట్టి కొట్టినట్లు.
చెప్పులున్నవాడితోను, అప్పులున్నవాడితోను పోరాదు.
చెప్పులోని రాయి, చెవిలోని జోరీగ, ఇంటిలోని పోరు.
చెప్పేవానికి చేదస్తమైతే, వినేవానికి వివేకం ఉండద్దా.
చెప్పేవానికి, చేసేవాడు లోకువ.
చెయ్యికాలినప్పుడల్లా కుండ వదిలిపెడతామా!
చెరుకు ఉండేచోటికి చీమలు తామే వస్తవి.
చెరుకు వంకరబోతే, తీపి చెడుతుందా?
చెఱపకురా చెడేవు, ఉరకకురా పడేవు.
చెరపడానికి చేతులు వస్తాయిగాని, నిలపడానికి చేతులురావు.
చెఱువు నిండితే కప్పలు చేరవా?
చెఱువులో వున్న బర్రెను, కొమ్ములుచూచి బేరం చేసినట్లు.
చెలిమిని చేదు తినిపించవచ్చునుగాని, బలిమిని పాలు త్రాగించ లేము.
చెవిటివాని ఎదుట శంఖూదితే,
దాన్ని కొరకను నీ తాతలు లేచిరావాల అన్నాడట.

చేతిలో లేనిది చేలోకి ఎలా వస్తుంది.
చేతి వేళ్లు అయిదూ ఒక రీతిగా ఉంటాయా ?
చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకున్నట్టు.
చేదతాడు కురచైతే బావి పూడ్చుకొంటారా ?
చేనుపండాలి, ఇల్లు నిండాలి.
చేప అని మొసలినోట్లో చేయి పెట్టినట్టు.
చేప పిల్లకు ఈత నేర్పాలా ?
చేయని చేతులు, కుడవని నోరు.
చేయని రెక్కలు చెడలు పడతాయి, చేసిన రెక్కలు సేగలువారుతాయి.
చేలోలేనిది, చేతిలోకెలా వస్తుంది ?
చేసింది పోదు, చేయంది రాదు.
చేసిన చేష్టలు ఎవరూ చూడరుకాని, కోసిన ముక్కు అందరూ చూచినారట !
చేసిన పాపాలకు, పెట్టిన దీపాలకు సరి.
చేసినవారికి చేసినంత మహాదేవ !
చేసేవి నాయకాలు. అడిగేవి తిరిపాలు, పెట్టకుంటే కోపాలు.
చేసేవి లోపాలు, చెప్పితే కోపాలు.
చేతిలో విషమున్నా తినందేచావడు.
చేతిలో గడియారం లేకపోయినా
గోడమీద క్యాలెండరయినా కనబడలేదుటయ్యా ?

ఛీ ! కుక్కా ! అంటే ! ఏమక్కా ! అన్నదట !

# జ

జగడమెట్లా వస్తాది లింగమయ్యా అంటే,
బిచ్చం పెట్టవే బొచ్చుముండా అన్నాడట ?
జగమెరిగిన బ్రాహ్మడికి జందెమేల ?
జనవాక్యం కర్తవ్యం.
జన్మానికంతా శివరాత్రి అన్నట్టు.
జమ్మి ఆకుతో విస్తరి కుట్టినట్లు.
జరుగుబాటుంటే, జ్వరమంత సుఖంలేదు.
జలగ పట్టినట్లు.
జలుబు మందుతింటే వారందినాలుంటుంది, తినకపోతే ఏడుదినాలుంటుంది.
జవ్వాది పూసుకొని చంకలెత్తినట్లు.

జాతి నాగుల చంపుతూ, ప్రతిమ నాగులకు పాలుపోసినట్లు.

జింకకు కొమ్ములు బరువా?
జిల్లేడు పూలకు తుమ్మెదలాశించినట్లు.
జిల్లేళ్ళకు పువ్వులు పూయునా?
జిహ్వకొకరుచి, పుర్రెకొకబుద్ధి.

జీతం బత్తెం లేకుండా తోడేలు గొర్రెలను కాస్తానన్నదట!
జీవరత్నాన్ని ఇత్తడిలో పొదిగితే రత్నానికేమిలోటు.
జీలకఱ్ఱలో కఱ్ఱలేదు, నేతిబీరలో నేయిలేదు.

జుట్టుంటే ఎన్ని జడలైనా వేయవచ్చును.
జుట్టువున్న అమ్మ ఏ కొప్పయినా పెట్టవచ్చు.

జెముడు కంచెకు శ్రేష్టం, రేగడ చేనికి శ్రేష్ఠం.

జేనెడు పిట్టకు మూరెడు తోక.

జోడు లేని బ్రతుకు—జాడులేని దొంగరము.

## ట

టెంకాయ చెట్టెందుకు ఎక్కినావురా? అంటే, దూడ గడ్డికన్నాడట
గడ్డి చెట్టుపైన ఉంటుందా? అంటే, లేదుకాబట్టే
దిగి వస్తున్నా నన్నాడట కాయలదొంగ.

## డ

డబ్బు ఇవ్వనివాడు, పడవ ముందర ఎక్కును.
డబ్బు రానివిద్య దరిద్రానికే.

డాబుసరి బావా! అంటే డబ్బులేని మరదలా అన్నాడట.

ఢిల్లీకి ఢిల్లే, పల్లెకు పల్లే.
ఢిల్లీకి పోయి ఉల్లిగడ్డ తెచ్చినట్లు.
ఢిల్లీకి రాజైనా తల్లికి కొడుకే.

## త

తండ్రి చస్తే పెత్తనం తెలుస్తుంది, తల్లిచస్తే కాపురం తెలుస్తుంది.
తండ్రి తవ్విన నుయ్యి అని, దానిలో దూకవచ్చునా?
తంతే దూడి పరుపుమీద పడ్డట్లు.
తగినట్లు కూర్చెరా, తాకట్లమారి బ్రహ్మ.

తగిలించుకోవడం సులభం, వదిలించుకోవడం కష్టం.
తడక కొంపలో దీపాలు వెలుగవా ?
తడిగుడ్డతో గొంతు కోసినట్లు.
తద్దినపు భోజనానికి పిలిస్తే, రోజూ మీ ఇంట ఇట్లాగే జరగాలని దీవించాడట!
తన అన్నం తాను తింటూ, తన గుడ్డ తాను కడుతూ ఊరికి భయపడవలెనా ?
తనకంట్లో దూలాలెట్టుకుని, పరులకంట్లో నలుసు లెంచినట్లు.
తనకంపు తనకింపు, ఒకరికంపు ఓకరింపు.
తనకు కానిరాజ్యం పండితేనేమి ? మండితేనేమి ?
తనకు మాలిన ధర్మం మొదలు చెడ్డబేరం.
తనకు లేదని ఏడిస్తే ఒకకన్ను,
ఇంకొకరికున్నదని ఏడిస్తే ఇంకొకకన్ను పోయిందట !
తనకోపమే తనశత్రువు.
తన గుణము మంచిదయితే, సానివాడలోగూడ కాపురము చేయవచ్చును.
తనదాకా వస్తేకాని, తలనొప్పి బాధ తెలియదు.
తనది తాటాకు, ఇవతలవాళ్ళది ఈతాకు.
తన పెరటిచెట్టు మందుకు పనికిరానట్లు.
తన బలిమికన్న స్థానబలిమి మిన్న.
తనలో తప్పులేకపోతే, గురువుతో గుద్దులాడవచ్చును.
తనసొమ్ము సోమవారం, మందిసొమ్ము మంగళవారం.
తన్ను తప్పించి ఆకాశమంత పిడుగు పడమన్నట్లు.
తను వలచింది రంభ, తను మునిగింది గంగ.
తప్పులెన్నువారు తండోపతండాలు.
తప్పులెన్నువారు తమతప్పులెరుగరు.
తప్పులేనివారు ధరణిలోలేరు.
తమలపాకుతో తానిట్లంటే, తలుపుచెక్కతో నేనిట్లంటి.
తమలము వేయనినోరు, కమలములేని కోనేరు.
తల ఊపినందుకు తంబూరు బుఱ్ఱ యిచ్చి పొమ్మన్నట్లు. (పాటకునితో)
తలకాయలోపలికి దూర్చిన తాబేలువలె.
తలకోసి ముందర పెట్టినా, గారడి విద్యే అన్నట్లు.
తలగడ కింద తాచుపామువలె.
తలగొరికించుకొన్న తర్వాత తిథినక్షత్రం చూచినట్లు.
తలదన్నేవాడు పోతే, తాడిదన్నేవాడు వస్తాడు.
తలప్రాణం తోకకు వచ్చినట్లు.

తలలు బోడులైన తలపులు బోడులా?
తలలో నాలుక, పూసలలో దారమువలె.
తలవంచుకొంటే, ఏడు గోడలచాటు.
తలుచుకొన్నపుడే తలంబ్రాలు కావాలంటే ఎలాగు?
తలుపులు మింగేవానికి అప్పడాలు లొటలొట.
తల్లికి కూడు పెట్టనివాడు తగవు చెప్పేడు.
తల్లినిచూచి పిల్లను, పల్లనుచూచి పసువునుకొనవలె.
తల్లిని నమ్మినవాడు, ధరణిని నమ్మినవాడు చెడడు.
తల్లి పుట్టిల్లు మేనమామ(కెరిక) వద్ద పొగడినట్లు.
తల్లిలేని పుట్టిల్లు, ఉల్లిలేనికూర.
తల్లివిషం, పెళ్లాము బెల్లం.
తవుడుతింటూ ఒయ్యారమా?
తవుడుతింటే చచ్చేవానికి విషంపెట్టేవాడు శెట్టి.
తవ్వగా తవ్వగా తథ్యం తేలుతుంది.

తాగినవాడు తప్పినవాడు ఒకటే.
తాగినవానిదే పాట, సాగినవానిదే ఆట.
తాగుటకు ముందు, వ్రాతకు వెనుక చూడవలె.
తాగుబోతు తోడు కోరతాడు.
తాజెడ్డకోతి వనమెల్ల చెఱచె.
తాటాకు చప్పుళ్ళకు కుందేళ్ళు బెదరునా?
తాటిచెట్టుక్రింద పాలుత్రాగినా, కల్లే అంటారు.
తాటిచెట్టునీడ నీడకాదు, తగులుకొన్న ముండ పెండ్లాముకాదు.
తాటోటుగాడికి దధ్యన్నం, విశ్వాసపాత్రుడికి గంజన్నం.
తాడు అని ఎత్తి పారవెయనూకూడదు, పాము అని దాటనూకూడదు.
తాడులేకుండా, బొంగరం ఆడించేవాడు.
తాతలనాడు నేతులుతాగాం, మా మూతులు వాసనచూడు.
తాతాచార్యులేమి చేయుచున్నాడు? అంటే! తప్పుచేసి దిద్దుకొంటున్నాడు.
తాతా! పెండ్లాడుతావా? అంటే, నాకెవరిస్తారురా అబ్బాయి అన్నాడట!
తాతా! సంధ్యవచ్చునా? అంటే! ఇప్పుడు చదువుకున్న నీకేరాకపోతే,
అరవై ఏళ్ళకింద చదువుకొన్న నాకు వచ్చునా? అన్నాడట.
తా దిన తవుడులేదు, వారాంగనకు వడియాలట.
తాను ఒకటితలిస్తే, దైవమింకొకటి తలచిట్లు.
తాను దొంగైతే, పరులను నమ్మడు.

తాబట్టిన కుందేటికి మూడేకాళ్ళు.
తానుమింగేదాన్ని, తన్నుమింగేదాన్ని చూచుకోవాలి.
తాను మెచ్చితినాలి, ఒకరు మెచ్చనడవాలి.
తా బోతే మజ్జిగచుక్కకు గతిలేదు, చీటివస్తే పెరుగు పంపుతారన్నట్లు.
తామరాకుపై నీటిబొట్టువలె.
తాయితులకే పిల్లలుపుడితే, తానెందుకు !
తాళ్ళపాకవారి కవిత్వం కొంత, తన పైత్యంకొంత.

తింటే ఆయాసం, తినకుంటే నీరసం.
తింటేగాని రుచి తెలియదు, దిగితేగాని లోతుతెలియదు.
తింటే బతాణ, వింటే అఠాణ. (రాగం)
తింటేమీగడ తినాల, వింటే బేగడవినాల.
తింటే గారెలు తినాలి, వింటే భారతం వినాలి.
తిండికి ఏనుగు, పనికి పీనుగు.
తిండికి వచ్చినట్టా ? తీర్థానికి వచ్చినట్టా ?
తిండి చింత, దండి చింత.
తిట్టితే చచ్చినవాడు లేడు, దీవించితే బ్రతికినవాడూలేడు.
తిట్టితే గాలికిపోతవి, తింటే లోనికిపోతవి.
తిట్టేనోరు, తినేనోరు, తిరిగేకాలు ఊరకుండవు.
తినగతినగ వేము తియ్యనుండు.
తినబోతూ రుచులడిగినట్లు.
తిననేర్చినమ్మ పెట్టనేరుస్తుంది.
తిని ఉండలేక, తాగి బొందనుపడినట్లు.
తిని కుడువవలె, ఋణాలుపోవలె, పనిజేయ పెండ్లికి పోవలె.
తినేకూటిలో మన్ను పోసుకున్నట్టు.
తినేది కుడిచేది తిమ్మక్క, మోసుకు తిరిగేది మొత్తెక్క.
తిన్న ఇంటివాసాలు లెక్కపెడతావేమిరా ?
అంటే పొరుగింటిసంగతి నాకేమి తెలుసు అన్నాడట.
తిమ్మన్నా! తిమ్మన్నా! నమస్కారమంటే, నాపేరు నీకెలా తెలిసింది ? అంటే
నీ ముఖం చూడగానే తెలిసింది అన్నాడట.
తిరిగి రైతు, తిరుగక బైరాగి చెడుతారు.

తీగ కదిలిస్తే, పొదంతా కదులుతుంది.
తీగకు కాయ బరువా ?

తీటగలవానికి, తోటగలవానికి తీరిక ఉండదు.
తీటబట్టినవాడే గోక్కుంటాడు.
తీపి ఏదంటే—ప్రాణం?
తీయగా తీయగా రాగము, మూల్గగా మూల్గగా రోగము.
తీయడం పెట్టడం తీపులచేటు కనడం కూచోవడం నొప్పులచేటు.
తీరుతీరు గుడ్డలు కట్టుకొని, తిరునాళ్ళకు బోతే, ఊరికొకగుడ్డ ఊసిపోయిందట.
తీర్థం స్వార్థం కలసివచ్చినట్లు.

తుట్టె పురుగుకు రెక్కలు వచ్చినా,
మునలివాడికి ప్రాయం వచ్చినా పట్టపగ్గాలుండవు.
తుమ్మకు తమ్ముడు లేడుగాని, ఆవలింతకు అన్న ఉన్నాడు.
తులము నాలుకకు తొంభై రుచులు.
తులసి కడుపున దురదగొండి పుట్టినట్లు.
తులసికోటలో ఉమ్మేసినావేమిరా? అంటే,
యజ్ఞవేదిక అనుకున్నాను అన్నాడట!
తులసి వనములో గంజాయి మొక్కవలె.
తులువ నోటికి ఉలవపప్పు.

తూట్లుమూసి, తూములు తెఱచినట్లు.

తెగువ దేవేంద్ర పదవి.
తెడ్డుండగా చేయి కాల్చుకున్నట్లు.
తెలివికి తలలేకపోయినా, భోజనానికి పొట్ట ఉంది.
తెలివి తక్కువ, ఆకలి ఎక్కువ.
తెలిసినవారికి ముందరనే ఉన్నది మోక్షం.
తెలిసేవఱకు బ్రహ్మవిద్య, తెలిసినతర్వాత కూసువిద్య.
తెల్లనివన్నీ పాలా? నల్లనివన్నీ నీళ్ళా?
తెల్లవారిన సంగతి నీకెట్లాతెలిసింది అని, ఒక రసికుడడిగితే—
బయటికి పోవాల్సివచ్చింది—అన్నదట పల్నాటిసీమ పడుచు;
దీపం వెలవెల బారింది—అన్నదట పాకనాటిసీమ వెలయాలు;
తాంబూలం అరుచి అయింది—అన్నదట నెల్లూరు నెఱజాణ.
తెల్లారితే చూడు ఎల్లాయి బతుకు.

తేనెటీగలకు తీరుబడి లేనిపని.
తేలుకుట్టిన దొంగవలె.

తేలుకు పెత్తనం ఇస్తే, తెల్లవార్లు తెగ కుట్టిందట!
తేలు తేలండీ! అని అరిస్తే, మొగవాళ్ళను పిలవ్వే అన్నాడట,
మీరు మొగవారుకారా? అని పెండ్లామంటే, సమయానికి
జ్ఞాపకంచేశావు, కట్ట లెమ్మన్నాడట.
తేలుమంత్రమైనా రాకున్నా, పాము పడగపై చేయిపెట్టినట్లు.
తేలేనయ్యకు తిండిమెండు, వండలేనమ్మకు వగపులుమెండు.

తొడిమ ఊడినపండు పడకుండా ఉంటుందా?
తొలకరి వానలు మొలకలకు తల్లి.

తోకవెంబడీ నారాయణా అన్నట్లు.
తోటలమీద వారికి. పే(పీ)టలమీద వారికి మొగమాటముండదు.
తోలు తీయకుండానే తొనలు మింగినట్లు.

# ద

దంచేదొకరు, పక్కలెగరేసే దింకొకరు.
దండించే దాత లేకుంటే, తమ్ముడు చండప్రచండుడు.
దంపుళ్ళ పాటకు దరిద్రంలేదు.
దగ్గు, సిగ్గు దాచినా దాగవు.
దప్పిగొన్నప్పుడు బావి త్రవ్వినట్లు.
దమ్మిడీ పెళ్ళికి రూపాయి బాణసంచా.
దయలేని అత్తకు దండంపెట్టినా తప్పే, ఊరకున్నా తప్పే.
దరిద్రుడికి పిల్లలెక్కువ.
దరిద్రుడికి సద్ది కట్టియిస్తే, ఊరివెలుపల కుంటకాడనే భోంచేసి పోయినాడట.
దరిద్రుడి సంగీతానికి భూమ్యాకాశాలే తాళపు చిప్పలు.
దరిద్రునికి దైవమే తోడు.
దరిద్రుడి తలకడిగితే వడగళ్ళవానట.
దరిలేనిబావి, దాపులేని కొంప.
దరిలేనిబావి, వితరణలేని ఈవి.
దశకొద్దీ పురుషుడు, దానంకొద్దీ బిడ్డలు.

దాగబోయి, తలారి ఇంట్లో దూరినట్లు.
దాగబోయిన చోట దయ్యాలు పట్టుకొన్నట్లు.
దానంచేయని చేయి-కాయిలు గాయని చెట్టు.
దానానలలో కెల్ల నిదానం [illegible]ష్టం.

దారిలో దొరికింది, ధర్మానికి పోయింది.
దాసరి తప్పు దండంతో సరి.

దిగంబర సన్యాసికి చాకలితో అవసరమేమి?
దినదినగండం నూరేండ్లాయుస్సు.
దినమూ చచ్చేవాడికి ఏడ్చేదెవరు?
దివిటీ ముందు దీపం పెట్టినట్లు.
దివ్వె తీసిన గూడువలె.

దీపము ఆరిన తరువాత దినుసంతా ఒకటే.
దీప ముండగనే ఇల్లు చక్కబెట్టుకోవలె.
దీపంపేరు చెబితే చీకటి పోతుందా?
దీపంముడ్డి కిందనే చీకటి.
దీపాన వెలిగించిన దివిటీ పెద్దదైనట్లు.
దీపావళికి దీపమంత చలి.

దుక్కి ఉంటే దిక్కువుంది.
దుడ్డుకట్ట అనగానే బుట్ట బద్దలవుతుంది?
దున్న దగ్గఱ వీణ వాయించినట్లు.
దున్నపోతు యీనిందంటే, చెంబుతేరా పాలుపితుకుదా మన్నట్లు.
దున్నపోతీనిందంటే దూడను కట్టెయ్ అన్నాడట.
దున్నబోతే దూడలలోను, మేయబోతే పోతులలోను.
దున్నలాగు కష్టపడి, దొరలాగున తినవలె.
దున్నుతూ ఉంటే నాగళ్ళు, పారుతూ ఉంటే నీళ్లు.
దున్నే అదనులో దూరదేశం పోయి,
కోతలకాలంలో కొడవలి పట్టవచ్చినాడట!
దున్నే ఎద్దునే పొడిచేది.
దుర్గంధ కుసుమానికంటె, నిర్గంధ కుసుమం మేలు.
దుష్టునిచూచి దూరంగా ఉండమన్నారు.

దూడ పొదుగును కుమ్మితేగాని ఆవు చేపదు.
దూరపు కొండలు నునుపు.

దెబ్బకు దయ్యం వెరుస్తుంది.

దేవతలకు దుమ్ము, రాక్షసులకు మన్ను.

దేవళం మింగేవాడికి ధ్వజ స్తంభం లొటలొట.
దేవుడని మొక్కితే, దయ్యమై పట్టుకొన్నట్లు.
దేవుడి పెళ్ళికందరూ పెత్తనగాండ్లే
దేవుడిస్తాడుగాని, వండి వార్చి వాత కొడతాడా?
దేవుడు వర మిచ్చినా, పూజారి వరమీయడు.
దేవునికి చూపులు, మనకు మేపులు.
దేశమెవరు ఏలుతున్నా, ధాన్యం దంచితేనే బియ్యమవుతాయి.

దొంగకు చేను పచ్చి అయితేమాత్ర మేమి?
దొంగకు దొంగ తోడు
దొంగతనానికిపోతూ, డోలు చంకన బెట్టుకొని పోయినట్లు.
దొంగలసొమ్ము దొరలపాలు.
దొంగలుపడ్డ ఆరు నెలలకు కుక్కలు మొరిగినవట.
దొంగవాడి దృష్టి మూటమీదనే.
దొంగ సంగతి దొంగ ఎఱుగును.
దొరకనిపూలు దేవునికర్పణం.
దొరల చిత్తం, చెట్ల నీడ నిలకడ లేనివి.
దొరికితే దొంగ, దొరకకపోతే దొర.
దోచుకొని పోయినవాడు దొర, దొరకినవాడు దొంగ.

ద్రవ్యం దాచినవాడికీ తెలుసు, లెక్క వ్రాసినవాడికీ తెలుసు.

ధరకు దొర ఎవడు?
ధర్మానికి బోతే, కర్మం చుట్టుకొన్నదట.

ధైర్యంలేని రాజు, యోచనలేని మంత్రి.

# న

నందనవనంలో నాగుబామున్నట్లు.
నక్క ఎక్కడ? నాగ(క)లోక మెక్కడ?
నక్క ఒకచోట ఊళవేసి, ఇంకొకచోట గౌరీకళ్యాణము పాడునా?
నక్క కడుపున సింగము పుట్టునా?
నక్క వినయము, కొంగ జపము.
నట్టేట పుట్టిముంచినట్లు. (మునిగినట్లు)
నడచేవాడే పడేది.
నడమంత్రపు దాసరి పొద్దుమానమెఱుగడు.

నడమంత్రపు వైష్ణవానికి నామాలు మెండు.
నడమంత్రాన సిరివస్తే, నడిరేయి గొడుగు పట్టమన్నాడట.
నడవడికలు చక్కబెట్టేవి నాటకము.
నడుము మునిగేదాకా చలి—నలుగురు వినేదాకా సిగ్గు.
నత్తగుల్లలో ముత్యాలు పుట్టునా?
నన్ను కొడితే కొట్టావుగాని, మా జావను కొట్టు చూస్తాం అన్నట్లు.
నన్ను ముట్టుకోకు నామాలకాకి అన్నట్లు.
నపుంసకుని చేతికి రంభ దొరికినట్లు.
నమ్మించి గొంతు కోసినట్లు.
నమ్మితి రామన్నా! అంటే, నా అంతటివాణ్ణి చేస్తానన్నట్లు.
నమ్మిన ఇమ్మ, నమ్మకున్న అమ్మ.
నమ్మి నానవాలు (నానబియ్యం) పోస్తే, పుచ్చి బుఱ్ఱలైనవంట.
నయాన పాలు తాగరు, భయాన విషమైన తాగుతారు.
నరుకలేని బంటు, కత్తి చుఱుకు లేదన్నట్లు.
నలుగురు నడిచించే బాట, పలువురు పలికించే మాట
నల్లకోడికైనా తెల్లగుడ్డే.
నల్లనివన్నీ నీళ్ళు, తెల్లనివన్నీ పాలు. (అనుకొనేటంత అమాయకుడు)
నల్లినిగూర్చి మంచానికి పెట్టు.
నల్లులకు వెఱచి ఇల్లు విడిచినట్లు.
నవరత్నములున్నా, నరరత్నముండవలె.
నవ్వలేనివారిని నమ్మరాదు.
నవ్విన ఊళ్ళే నగరాలౌతాయి.
నవ్విన నాపచేనే పండుతుంది.
నవ్వుల తోటలో నాగులు తిరుగును.
నవ్వే ఆడుదాన్ని, ఏడ్చే మగవాణ్ణి నమ్మరాదు.
నష్టపడినా భ్రష్టుకారాదు.

నాకిన్ని గంజిమెతుకులు పోయి, నీ కాకలి కాకుండా మందిస్తానన్నాడట.
(మంత్రం చెపుతాను అన్నట్లు)
నాకే కుక్కకు లింగమేమి? పానవట్టమేమి?
నా కోడీ కుంపటీ లేకపోతే, ఎట్లా తెల్లవారుతుందో—
ఎట్లా నిప్పు దొరుకుతుందో చూస్తాను అందిట ఒక అవ్వ.
నాగరికం లేనిమాట, నాలుకపై తీట.
నాగలి మంచిది కాకపోతే ఎడేమి చేసాయి?!

నాగుబాము చిన్నదనవద్దు, పాలివాడు సన్న మనవద్దు.
నా చెయ్యి నొస్తున్నది, నీ చేతితో మొత్తుకో అన్నట్లు.
నాదు వ్రాసినవాడు నేడు చెఱపి మళ్ళీ వ్రాస్తాడా?
నాథుడు లేని రాజ్యం నానాదారులు.
నాదముంటే గంట, వాదముంటే తంట.
నాదికాదు, నా అత్తసొమ్ము అన్నట్లు.
నానా రుచులు పారితే నాలుకమీద కొఱివి పెట్టుకొన్నట్లుంటుంది.
నా నోట్లో (నీవు) వేలుపెట్టు, నీ కంట్లో (నేను) వేలుపెడతానన్నట్లు.
నాన్చి నాన్చి వేస్తివో, నా కొంప తీస్తివో.
నా పాతివ్రత్యం నా మొదటిపెనిమిటికి తెలుసు.
నా పెండ్లి సగమైనదంటే, ఎట్లనయ్యా అంటే, నేను పెండ్లికొడుకుగా సిద్ధంగా ఉన్నాను; మిగతా సగానికి పెండ్లికూతురే కావాలన్నాడట.
నామాల వారేగాని (నీమాల) నియమాలవారు గారు.
నాయనకు పెండ్లి సంబరము, అమ్మకు సవతి సంకటము.
నారు, నీరు, నోరు, ఉంటే ఏ రాజ్యంలో ఉన్నా ఒకటే.
నారు పోసినవాడు నీరు పోయక మానడు.
నాలుక ఉన్నవాడు నాలుగు దిక్కులు తిరుగగలడు.
నాలుక కటువు, ఎద మెత్తన.
నాలుక దాటితే నరకము.
నాలుకలో నారాయణ, చంకలో చురకత్తి.
నాలుకా! నాలుకా! వీపుకు దెబ్బలు తేకే.
నావీపు నీవుగీరు, నీ వీపు నేను గీరుతా నన్నట్లు.
(ఒకరినొకరు పొగడికొనుట)

నిండా మునిగినవానికి చలేమి? గాలేమి?
నిండిన కడుపుకు అన్నం, బట్టతలకు నూనె.
నిండిన కడుపు నిక్కి మాట్లాడును.
నిండిన కడుపు నీతి వినదు. (ఎరుగదు)
నిండుకుండ తొణకదు.
నిండుచేరు నిలచి పాఱును.
నిండు బండికి చేటగూడ బరువే.
నిజమాడితే ఉండూరు అచ్చిరాదు.
నిజమాడితే నిష్ఠూరం.
నిజము కుఱుచ, బొంకు పొడవు.

నిజమునకు నింద వచ్చునుగాని, అవమానము రాదు.
నిజము నిలకడమీద తెలుస్తుంది.
నిజమైన బంగారం నిప్పుకు వెరువదు.
నిత్య కళ్యాణం పచ్చతోరణమన్నట్లు.
నిద్ర పోయినవానిని లేపవచ్చునుగాని, మేలుకొన్నవానిని ఎవడు లేపగలడు?
నిద్ర సుఖమెఱుగదు, ఆకలి రుచి ఎరుగదు.
నిన్న ఉన్నవాడు నేడు లేడు.
నిప్పుకు చెదలంటునా?
నిప్పుకూ, నీళ్ళకూ ఉన్నంత స్నేహం. (వాళ్ళిద్దరికీ)
నిప్పు త్రొక్కిన కోతివలె.
నియ్యతెంతో బర్కతంత.
నిర్భాగ్యునకు నిద్ర, అభాగ్యునకు ఆకలి ఎక్కువ.
నిలకడ నీళ్ళకే నాచుబట్టేది.
నిలకడలేని మాట నీళ్ళమూట.
నివురుగప్పిన నిప్పువలె.

నీకు ఎక్కడ సంశయమో, నాకు అక్కడే సందేహం.
నీకు రానిది, నేను విననిది, లోకములో లేనిది చెప్పమన్నట్లు.
నీ కూడుతిని, నీ గుడ్డకట్టి, నాకు కాపురం చేయమన్నాడట.
నీటికి కలువ, మాటకు చలువ.
నీటికొలది తామరతూడు.
నీటిలో జాడలు వెదకినట్లు.
నీటిలో కప్ప నీరు త్రాగకుంటుందా?
నీ తలమీద తేలు ఉన్నదంటే, నీ చేతితోనే కాస్త తీసివేయమన్నాడట.
నీతి లేనివాడు కోతికంటె బీడు.
నీ దున్నడంలో ఏముంది? ఉండేదంతా నా చల్లడంలో ఉంది.
నీ పెండ్లి పాడైంది నా పెండ్లికి తాంబూలానికి రమ్మన్నాడట!
నీ మగనికి రాగిపోగులే అంటే, నీమగనికి అవీ లేవే అందట!
నీ ముక్కున చీమిడేమమ్మా! అంటే,
నీ చేతితోనే అటు తుడిచి పొమ్మన్నదట.
నీరు ఉంటే నారు ఉంతవలె.
నీరు ఉంటే పల్లె, నారి ఉంటే ఇల్లు.
నీరు నూనె కలుస్తాయా?

నీరు పల్లమెఱుగు, నిజము దేవుడెఱుగు.
నీరు విడిచిన మొసలి—నీరు విడిచిన చేప.
నీవు దంచు, నేను పక్కలెగురవేస్తాను.
నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష!
నీవు పాడినదానికి, నేను విన్నదానికి సరిపోయింది;
తలూపినదానికి తంబూరా పెట్టిపో.
నీవు పెట్టకపోయినా, పెట్టే ఇల్లు చూపెట్టు.
నీ వెనక్కు—నీ వెనక్కు అన్న మర్యాదలు జరిగే లోపలే బండి వెళ్ళిపోయిందట.
(హైదరాబాదు మర్యాదల తీరు)

నుదుట వ్రాయనిదే నోట పలుకదు.

నూతి కప్పకు సముద్రం సంగతేమి తెలుసును?
నూతిలో నీరు తోడుకోవాలిగాని, తనంతట తానే పైకి వస్తుందా?
నూరు కాకులలో ఒక కోకిల.
నూరు నోములు ఒక ఱంకుతో సరి. (వ్యర్థమైపోవును)
నూరు పూసలకు ఒకే కొలికి!
నూరు మాటలు ఒక వ్రాతకు ఈడుకావు.

నెత్తిన నోరుండే పెత్తనం సాగుతుంది.
నెమలి కంటినీరు వేటకానికి ముద్దా?
నెమలిని చూచి నక్క నాట్యమాడినట్లు.
నెయ్యి అని అరచి, నూనె అమ్మినట్లు.
నెరజాణ నేరననును, నేర్తునను వాడు నిందలపాలగును.

నేతికుండ నేలబెట్టి, ఉత్తకుండను ఉట్టిమీద పెట్టినట్లు.
నేతిబీరకాయ (సామ్యము)
నేర్చి చెప్పినమాట నెరవాది మాట.
నేర్చినమ్మ ఏడ్చినా బాగుంటుంది.
నేర్చిన బుద్ధి ఏర్చినా పోదు.
నేర్చి బ్రతికినవాడు, నేర్వక చెడ్డవాడు లేడు.
నేల విడిచిన సాము—తాళం విడిచినపాట.
నేల విడిచి సాము—నీరు విడిచి ఈత.
నేలకు పోయేది నెత్తిన వేసికొన్నట్లు.

నోటికి తీపి, పొట్టకు చేటు.
నోటికి, చేతికి చీకటిలేదు.
నోటితో లేదనేది చేతితో లేదంటే సరి
నోరు ఉంటే, ఊరు ఉంటుంది.
న్యాయము తప్పినవానికి ఆచార్య కటాక్ష మెందుకు ?

# ప

పంచపాండవులంటే నాకు తెలియదా ? మంచపుకోళ్ళవలె ముగ్గురు అని,
రెండువ్రేళ్ళు చూపించాడట !
పంజరం అందంగా వుంటే పక్షికి సంతోషమా ?
పంజరంలో కాకిని పెట్టగానే పంచమ స్వరమాలపిస్తుందా ?
పంటకు పెంట, వంటకు మంట.
పంట పెంటలో ఉన్నది, పాడి పూరిలో ఉన్నది.
పండనినేల పందుం కంటే, పండేనేల కుంచెడేచాలు.
పండిత పుత్రుడు శుంఠ.
పండితమ్మన్యులకు పాదుకా పట్టాభిషేకం !
పండినా ఎండినా పని తప్పదు.
పండ్ల చెట్టుకింద ముండ్లకంప ఉన్నట్లు.
పంది ఎంత బలిసినా నంది కాదు.
పందికేమి తెలుసురా పన్నీరు వాసన ?
పందికొక్కును పాతరలో పెడితే ఉంటుందా ?
పందిగా పదేండ్లు బతికేకన్నా,
నందిగా నాలుగేండ్లు (బతికేది మేలు) బతితేకి చాలు.
పంది బురదమెచ్చు పన్నీరు మెచ్చునా ?
పకపక నవ్వేవాడు, గబగబ అరచేవాడు కపటమెఱుగడు.
పగ గలిగి బ్రతకటం, పామున్న ఇంట్లో బ్రతకడం ఒకటే.
పగటి మాటలు పనికిచేటు, రాత్రిమాటలు నిద్రకుచేటు.
పగబట్టిన త్రాచు కాటువేయక మానుతుందా ?
పగలుచూస్తే రాత్రికలలో వస్తుంది అన్నట్లు.
పగలు చెయ్యి పట్టుకుంటేరానేదుగాని రాత్రి సన్నగిల్లితే వస్తుందా ?
పచ్చగా ఉంటే పదిమంది చుట్టాలు.
పచ్చడమున్నంత కాళ్ళు చాచు.
పచ్చి వెలగకాయ గొంతులో పడ్డట్లు.

పట్టినదెల్లా బంగారం ముట్టినదెల్లా ముత్యం.
పట్టు పట్టరాదు. పట్టి విడువరాదు.
పడుచుతో సయ్యాట, పాముతో చెలగాట. (చెల్లాట)
పడ్డవారు చెడ్డవారు కారు.
పదము తప్పినా ప్రాసతప్పరాదు.
పదమొక జానిస, రాగమొక రంభ.
పదిమంది కలవాడు పంద అయినా సేద్యం చేస్తాడు.
పదిమంది చేరిన పనిపాడు.
పదిమంది నడచింది బాట, పదిమంది పలికిందిమాట.
పదిమందిలో పడ్డపాము చావకపోతుందా!
పదిరాళ్లు వేస్తే ఒకరాయైనా తగులదా?
పదుగురాడుమాట పాటియై ధర చెల్లు.
పద్మాసనం వేసి కూచుంటే పరమాన్నం వడ్డిస్తారా?
పనసకాయ దొరికినప్పుడే తద్దినం పెట్టమన్నట్లు.
పనికి బద్దకం, తిండికి పిడుగు.
పని చేయనివాడు ఇంటికీ దొంగ, పన్నివ్వనివాడు దివాణానికి దొంగ.
పని ముద్దా? పాటు ముద్దా?
పరనింద గృహక్షయం, యతినింద కులక్షయం.
పరులసొమ్ము పాపిష్టి సొమ్ము.
పరువిచ్చి, పరువు తెచ్చుకో.
పురువుకీ, కరువుకీ డబ్బు.
పలుకని వాళ్ళతో పది ఊళ్ళవాళ్ళయినా గెలువలేరు.
పల్లెటూరికి పది దారులు. (డొంకలు)
పశువుల పాలు మేపును బట్టి.
పసిపిల్లలు, త్రాగుబోతులు నిజం చెబుతారు.

పాండవులవారి సంపాదన దుర్యోధనులవారి పిండాకూళ్ళకు సరి.
పాకీదానితో సరసంకంటె, అత్తరు సాహెబుతో కలహంమేలు.
పాటు చేతగానివాడు మాటలకు మొనగాడు.
పాడి ఆవును దానంచేసి, పాలు తాను పితుకుకొన్నట్లు.
పాడికి పంట తమ్ముడు.
పాడికుండ పగులగొట్టుకొనినట్లు.
పాడిలేని ఇల్లు, పాడుబడ్డ బీడు.
పాతది పనికిరాదు, కొత్తది కొరగాదు.

పాపభీతికంటె, ప్రజాభీతికే వెరుస్తారు.
పాపమని పాలుపోస్తే, పడ్డని వలకబోసినాడట.
పామూ చావరాదు, బడితే విరుగరాదు.
పాయసంలో నెయ్యి ఒలికినట్లు.
పాలకోసం పొదుగు కోసినట్లు.
పాలపొంగు-పడుచు పొంగు.
పాలలో పంచదార ఒలికినట్లు.
పాలసముద్రంలోని హంస పడియనీటి కానపడుతుందా?
పాలు కుడిచి రొమ్ము గ్రుద్దినట్లు.
పాలు బోసి పెంచినా వేపకు చేదుపోదు. (తీపిరాదు)

పిండికొద్ది రొట్టె, తిండికొద్ది పసరం.
పిండేవాడు పిండితే, పిటుకురాయైనా పాలిస్తుంది.
పిచ్చి కుదిరితేగాని పెళ్ళికాదు, పెళ్ళి అయితేగాని పిచ్చికుదరదు.
పిచ్చివాడికి లోకమంతా పిచ్చే!
పిచ్చివాని చేతిరాయి తగిల్తే తగులుతుంది, తప్పితే తప్పుతుంది.
పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం.
పిట్టకు పట్టెదెంత?
పిట్టకొంచెము, కూత ఘనము.
పిట్టపోరు పిట్టపోరు పిల్లి తీర్చినట్లు.
పిడుగుకు గొడుగడ్డమా?
పిడుగుకు, బియ్యానికి ఒకటే మంత్రమా?
పిఱికి వారికే పిడికెడంత మీసాలు.
పిల్ల నిచ్చినవాడు ఈగ, పుచ్చుకున్నవాడు పులి.
పిల్లబావిలో పడ్డదిరా అంటే, ఉండు? అంబలి తాగి వస్తానన్నట్లు.
పిల్లలులేనిది ఇల్లుకాదు, పిట్టలులేనిది తోపుకాదు.
పిల్లకాకికేమి తెలుసు ఉండేలుదెబ్బ.
పిల్లా! పిల్లా! పెట్టనిస్తావా? అని రావూరు రసికు డడిగితే,
అమ్మనయ్యా! అన్నదట నెల్లూరు నెఱజాణ!
పిల్లికి ఎలుక సాక్షి.
పిల్లికి చెలగాటం (చెర్లాటం), ఎలుకకు ప్రాణసంకటం.
పిల్లికి రొయ్యల మొలతాడు కట్టినట్లు.
పిల్లి శాపాలకు ఉట్టి తెగుతాయా?

పీనుగకు చేసిన శృంగారం–నగిరికిచేసిన కొలువు.
పీనుగను పొడిచిన బల్లెమువాడు.
పీర్ల పండుగకు గోకులాష్టమికి ఏమి సంబంధము?

పుండు ఒకచోట, మందు ఇంకొకచోట.
పుండుమీద కారం చల్లినట్లు.
పుచ్చిన మిరియాలకైనా జొన్నలు సరిరావు.
పుట్టపై బాదిన పాము చస్తుందా?
పుట్టనివాడు గిట్టనివాడు పుణ్యాత్ములు.
పుట్టమీద తేలు కుట్టినా నాగుబాము కరచినట్లే.
పుట్టినవాడు గిట్టకపోడు.
పుట్టుకతో వచ్చినబుద్ధి పుడకలతోగాని పోదు.
పుణ్యంకొద్దీ పురుషుడు, విత్తంకొద్దీ వైభవము.
పుల్లయ్య వేమవరం వెళ్ళినట్లు.
పూచిన పూలెల్లా కాయలైతే చెట్టు మనునా?
పూజ కన్నా బుద్ధి, మాటకన్నా మనసు ప్రధానం.
పూజ పునస్కారాలు లేక బూజెక్కి ఉన్నానుగాని, నైవేద్యం పెట్టు నా మహిమ చూపిస్తాను.
పూబోడి అంటే, ఎవర్రాబోడి? నీ అమ్మబోడి, నీ అక్కబోడి అన్నదట.
పూర్వోత్తరా లెరిగి పొత్తు చేసుకోవాలె.
పూవు పుట్టగానే పరిమళం వెదజల్లుతుంది.
పూవు పుట్టగానే, వాసన!
పూవులమ్మిన అంగడిలోనే కట్టెలు అమ్మినట్లు.
పూసలలో దారము వలె.

పెంటకుప్ప పెరిగితే, పేదరైతు పెద్దగును.
పెంటతినే బట్టెపాలు పనికిరాకుండా పోతున్నవా?
పెండ్లాము బెల్లము, తల్లిదయ్యము.
పెండ్లికి చేసినప్పు, పేరంటాండ్రు చవిచూడను సరిపోయింది.
పెండ్లికి వెడుతూ పిల్లిని చంకను పెట్టుక వెళ్ళినట్లు.
పెండ్లికొచ్చినవారు వారే చేస్తారు, పెండ్లామా! నీ ఒళ్ళు అలిపించుకోకు.
పెండ్లికొడుకు మనవాడేగాని, చెవులపోగులు మాత్రం మనవిగావు.
పెండ్లినాటి పప్పుకూడు దినమూ రమ్మంటే వస్తుందా?
పెండ్లినాటి సౌఖ్యం లంఖణాలనాడు తలచుకున్నట్లు.
పెండ్లినిచూస్తూ ఒకడుంటే, పెండ్లాన్ని చూస్తూ ఒకడున్నాడు.

పెండ్లి సందడిలో పుస్తెకట్ట మరచారట!
పెట్టకపోయినా, పెట్టే ఇల్లు చూపమన్నారు.
పెట్టలేనమ్మ పెక్కు సీమలకు పెద్ద.
పెడితే తింటారుగాని, తిడితే పడతారా!
పెట్టినదంతా పైరుకాదు, కడుపులన్నీ కాన్పులుగావు.
పెట్టిన పైరంతా పట్టిసాలైతే, రైతు బ్రతుకు కట్టతెగిన చెఱువు.
పెట్టినవానికి తెలియును విక్షేపము.
పెదవికి మించిన పల్లు-ప్రమిదకు మించిన వత్తి.
పెదవి మందహాసం-ఎద చంద్రహాసం.
పెదవిదాటితే పృథివి దాటుతుంది.
పెద్దల ఉసురు పెనుబామై తగులును.
పెద్దిభొట్లూ, పెద్దిభొట్లూ! సన్యాసం తీసుకొంటావా? అంటే,
చెప్పుతో మాడునకొట్టితే తీసుకోక తప్పుతుందా? అన్నాడట.
పెనములో నుంచి పొయ్యిలో పడ్డట్లు.
పెరుగగా పెరుగగా పెదబావగారు కోతి అయినట్లు.
పెరుగుట విరుగుట కొఱకే.
పెళ్ళి బాగుంది, పప్పువండితే మరీ బాగుంటుంది.

పేదల కోపం పెదవికి చేటు.
పేనుకు పెత్తనమిస్తే, తలంతా తెగకొరికి పెట్టిందట.
పేరు ఒకరిది, పెత్తనం ఇంకొకరిది.
పేరు ఒకరిది, నోరు ఒకరిది.

పైన పటారం, లోనలొటారం.
పైసా? పైసా! ఏం జేస్తావంటే, ప్రాణంవంటి మిత్రుణ్ణి పగచేస్తానందట!
పైసాలో పరమాత్ముడున్నాడు.

పొంకణాల పోతిరెడ్డికి ముప్పై మూడు దొడ్లు, మూడు ఎడ్లు.
పొగచుట్టకు సతిమోవికి ఎంగిలి లేదంటారు.
పొగాకు అడుక్కోవాలి, అందలం బయటపెట్టరా అన్నట్లు.
పొట్టివానికి పుట్టెడు బుద్ధులు.
పొట్లకాయకు రాయికడితే సరిగాని, కుక్కతోకకు గడితే ఫలమేమి?
పొడుమెక్కించే ముక్కూ, పొగపీల్చే నోరూ శుభ్రంగా వుండవు.
పొద్దు తిరుగుడు, దొంక తిరుగుడు.
పొమ్మనలేక పొగబెట్టినట్లు.

పొరుగింటి కలహం వినవేడుక.
పొరుగింటి పుల్లకూర రుచి.
పొరుగింటి బిడ్డను దించి, నీటి లోతు జూచినట్లు.
పొర్లించి, పొర్లించి కొట్టినా, మీసాలకు మన్ను కాలేదు అన్నాడట!

పోక ముడి విప్పుతూ, కోక వెల అడిగినట్లు.
పోయినకంటికి మందు వేయబోతే, ఉన్నకన్ను ఊడ్చుక (ఊడి) పోయిందట!
పోరానిచోట్లకుపోతే, రారాని నిందలు రాకమానవు.
పోరిన పొరుగు, రాచిన కుండలు మనవు.
పోరు నష్టం, పొందు లాభం.

ప్రజలమాటే ప్రభువు కోట.
ప్రజ్ఞలేని శౌర్యం–పదునులేని ఖడ్గం.
ప్రథమ కబళంలోనే మక్షికాపాతం.
ప్రయాణాలు అబద్ధం, ప్రసాదాలు నిబద్ధం.
ప్రసాదానికి ముందు, పనికి వెనుక.
ప్రసూతి వైరాగ్యం, పురాణ వైరాగ్యం, శ్మశాన వైరాగ్యం, అభావవైరాగ్యం.

ప్రాణంపోయినా మానం దక్కించుకోవలె.
ప్రాణం పోయేటప్పుడు కూడ త్రాచు పడగ దించదు.
ప్రాణంమీదికి వచ్చినప్పుడు, పంచాంగంచూచి మందుపోస్తారా? (త్రాగిస్తారా?)
ప్రాణ మున్నప్పుడే పంతాలు నెరవేఱుతాయి.
ప్రాయము వస్తే పందిపిల్ల కూడ బాగుంటుంది.
ప్రాయాన బెట్టిన పంట–ప్రాయాన కన్నకొడుకు.
ప్రాసకోస మేడ్చానే కూసుముండా! అన్నట్లు.

ప్రియం మహాలక్ష్మి, చౌక శనేశ్వరం.

ప్రీతితో పెట్టింది పిడికెడైనా చాలు.

# ఫ

ఫలానికి తగిన బీజము, నేలకు తగిన నీరు.

# బ

బంగారమునకు తావి అబ్బినట్లు.
బంగారు గాలానికి బంగారు చేపలు పడవు.

బంగారు చెప్పులైనా (ముచ్చెలైనా) కాళ్ళకే తొడగాలి.
బంధువయితే మాత్రం బంధాలు తొలగిస్తాడా?
బంధువుడప్పు సరేగాని, పైరులో చేయి పెట్టవద్దు.
బంధువులంతా ఒకదిక్కు, దావమరిది ఇంకొకదిక్కు.
బట్టతలమ్మ పాపట తీయమన్నట్లు.
బత్తెమెక్కడో సత్యమక్కడ.
బయట తన్ని, ఇంట్లో కాళ్ళు పట్టుకున్నట్లు.

బాలవాక్కు బ్రహ్మవాక్కు.
బాలుర దీవెనలు బ్రహ్మ దీవెనలు.
బావా! అని చూడబోతే, రావా? అని కొంగు పట్టుకున్నాడట?

బిడ్డ వచ్చినవేళ, గొడ్డు వచ్చిన వేళ.

బూతు లేకున్న నీతిలేదు.

బెల్లము ఉందా అంటే? అల్లము ఉంది అన్నట్లు.
బెల్లము ఉన్నంత సేపే ఈగలు ముసిరేది.
బెల్లము పారవేసి ఆకు నాకినట్లు.

బొమ్మకు మొక్కినా నమ్మక ముండవలె.

బోగందాని తల్లి చస్తే అందరూ పరామర్శించేవాళ్ళేగాని, బోగందే చస్తే తొంగిచూచే వాళ్లుండరు.

బోటికి నీటు-కూటికి చాటు.
బోనులో పడ్డ సింహం వలె.
బోసినోటివానికి పేలపిండి ప్రీతి.
బోడిగుండంత సుఖంలేదు. ఊరకున్నంత ఉత్తమంలేదు.

బ్రతికిన బ్రతుకు చెప్పుకుందాము, బయట ఎవరు లేకుండా చూడమన్నాడట.
బ్రతికిన బ్రతుక్కు భగవద్గీత పారాయణమా?
బ్రతికుంటే బలుసాకుతిని బ్రతకవచ్చు.
బ్రహ్మకైనాపుట్టు రిమ్మ తెగులు.
బ్రహ్మచారి ముదిరినా, బెండకాయ ముదిరినా పనికిరాదు.

బ్రాహ్మడా! బ్రహ్మడా! నీ ఆచార మెంత? అంటే. నీటికొద్దీ అన్నాడట! (నీళ్ళకొద్దీ ఆచారం).

## భ

భగవంతా నాకేం చింత అంటే, పొద్దునలేస్తే పొట్టదే చింత.

భగవద్గీత చెప్పుకుంటారా అంటే, కడుపునిండింది ఇంక తినలేను అన్నాడట.
భయమైనా ఉండాలి, భక్తైనా ఉండాలి.

భాగ్యముంటే, బంగారం తింటారా?
భాషకు తగిన వేష ముండాలి.

భూము లిచ్చినట్లు భూపతు లీయగలరా?

భోజనానికి వద్దంటే, పట్టుచీర కట్టుకొని వస్తానన్నట్లు.
భోజునివంటి రాజుంటే, కాళిదాసువంటి కవి ఉంటాడు.

## మ

మంచ మెక్కినమీదట మర్యాదలేల?
మంచమెక్కి వరుస లడిగి నట్లు.
మంచి కొంచెమైనా చాలు, విత్తనం చిన్నదైనా చాలు!
మంచిగా ఉంటే నేను చేశాననుకో, మంచిగాలేకుంటే మా వాడు చేశాడనుకో.
మంచిమాటకు మందిఅంతా మనవాళ్ళే.
మంచి మంగలైనా, ఎగ గొరిగితే మంటే.
మంచివాడు మంచివాడు అంటే, మంచమెక్కి గంతులు వేశాడట!
మంచివాని కొకమాట, మొరకుకొక వే(ఏ)టు.
మంచివానికి మాటే మందు.
మంచిగొడ్డుకు ఒకదెబ్బ, మంచి మనిషికి ఒకమాట.
మంత్రంలేని సంధ్యకు మరి చెంబుడు నీళ్ళు.
మంత్రసానితనానికి ఒప్పుకున్న తర్వాత, ఏది వచ్చినా పట్టాలి.
మందికి చెప్పాను కానీ, మనకు చెప్పానా?
మంది యెక్కువయితే (మోపయితే) మజ్జిగ పలుచన.
మందుకు పథ్యం, మాటకు సత్యం.
మందుకుపోయిన వాడు మాసికానికి వచ్చినట్లు.
మఖలో పుట్టి, పుబ్బలో మాడినట్లు. (గిట్టినట్లు)
మగని సొమ్ముతిని, మిండని పాట పాడినట్లు.
మగవాడు తిరుగక చెడును, ఆడది తిరిగిచెడును.
మగవాని పెండ్లా? ఆడదాని పెండ్లా? అంటే, ఆదేమో నాకు తెలియదు,
గాడిపొయ్యిదగ్గర కాస్తవేస్తే గతికి వచ్చినాను అన్నాడట!
మజ్జిగకు వచ్చి, ముంత దాచినట్లు.
మడికి గట్టు, మాటకు గుట్టు.

మతి ఎంతో గతి అంత.
మతికి [illegible] గలిగిన మగడు.
మతిలేని మాట—శ్రుతిలేని పాట.
మతులెన్ని చెప్పినా మందబుద్ధి మానదు
మదిలోన నొక్కటి, మాట్లాడు టొకటి.
మనచల్ల మనమే పలుచన చేసుకుంటామా ? (అనుకొంటామా?)
మనదీపమైతే మాత్రం, ముద్దుపెట్టుకుంటే మూతి కాలదా ?
మన నువ్వులలో నూనె లేకపోతే, గానుగవాణ్ణి అంటే ఏం లాభం ?
మనసుంటే మార్గముంటుంది.
మనసు మహామేరువు దాటును, కాలు కందకం దాటదు.
మనసున నాటిన మాటల చెరపలేరు.
మనసు లేని మనవు వలె.
మనసులోని మర్మం దాచుకొనే మానవుడు మాటలు నేర్చినవాడు.
మనస్సుకు మనస్సే సాక్షి.
మనిషి కాటుకు మందులేదు.
మనిషికి ఒకమాట, పండుకొక రుచి. (పశువుకొక దెబ్బ)
మనిషికి మాటే అలంకారము.
మనిషి కొక తెగులు మహిలో వేమా అన్నారు.
మనిషి చస్తే మాట మిగులుతుంది, ఎద్దుచస్తే ఎముక మిగులుతుంది.
మనిషి పేదయితే, మాటకు పేదా ?
మనిషిబొమ్మవ్రాసి క్రింద మనిషి అని ఎందుకు వ్రాసినావంటే,
లేకుంటే కోతి అనుకుంటారన్నాడట.
మనోవ్యాధికి మందులేదు.
మన్ను తిన్న పామువలె.
మన్నును నమ్మి దున్నినవాడే మన్నీడు.
మన్ను పట్టితే బంగారం, బంగారం పట్టితే మన్ను.
మన్ను, మిన్ను మెత్తనయితే మనుష్యులకు బ్రతుకు.
మన్ను వెళ్ళకుండా దున్నితే, వెన్ను వెళ్ళకుండా పండును.
మఱచిపోయి చచ్చినాను, ప్రాణమా ! రమ్మంటే వస్తుందా ?
మసిపాతలో మాణిక్య మట్లు.
మసిపూసి మారేడును నేరేడు చేసినట్లు.
మహాంధకారంలో ఆదిపర్వతిపన్నట్లు.

మహారాజువారిని మనవి చేసుకుంటే, మరిరెండు వడ్డించమన్నాడట!
మహారాజుకైనా మన్ను నమ్మినవాడే అన్నం పెట్టాలి.
మహావృక్షం క్రింద మొక్కలు పెఱుగవు.
మనసు మనువుకేడిస్తే వీపు దెబ్బల కేడ్చిందట.
మట్టిలో మాణిక్యమున్నట్లు.

మా ఇంటికొస్తే మాకేం తెస్తావు? మీ ఇంటికొస్తే మాకేమి ఇస్తా
మాఘమాసములో మార్జికులు సైతం వణకును.
మా చక్కెరతో మీ పొంగలెందుకు వండాలి?
మాటకారి నీటుకాడు.

మాటకు పడిచస్తాము కాని, మూటకు పడిచస్తామా?
మాటకు మా ఇంటికి, కూటికి మీ యింటికి.
మాటకు మాట తెగులు, నీటికి నాచు (పాచి) తెగులు.
మాటకు మాట శృంగారం, పేటకు కోట శృంగారం.
మాటకుముందు ఏడ్చే మగవాణ్ణి, నవ్వే ఆడదాన్ని నమ్మరాదు.
మాటకు సొంపు, పాటకు ఇంపు.
మాటగొప్ప చెప్పు మాటలు చాలవు.
మాట గొప్ప–మానిక పిచ్చు.
మాట చుట్టమేగాని, పూట చుట్టం కాదు.
మాట చూడనిదే మనసీయరాదు.
మాట మాటకు తప్పు, బోడి నెత్తికి ముప్పు.
మాటలకు మా యింట్లో, మాపటికి మీ యింట్లో.
మాటలచేత మన్ననలు పొందవచ్చు.
మాటలచేత మహాకాళిని నవ్వించవచ్చు.
మాటలచేత మహారాజు బిడ్డను మనువు తెచ్చుకోవచ్చు.
మాటలచేత మాన్యాలు సంపాదించవచ్చు.
మాటలతో మూటలు కొనవచ్చు.
మాటల పసేగాని, చేతల పసలేదు.
మాటలతోనే మసుబోలువాడు పిడూరు దాటినట్లు.
మాటలలో పడి మగనిని మఱచినట్లు,
మాటల సత్రానికి నాదో పల్లా. (నాదొక బస్తా)
మాటలు ఆకులు, చేతలు పండ్లు. (కాయలు)
మాటలు కోటలు దాటును, కాలు గడప దాటదు.

మాటలు చెప్పే మొనగాండ్లేగాని, కూడు బత్తెమిచ్చే పుణ్యాత్ములులేరు.
మాటలు నేర్చినకుక్కను వేటకు తీసుకుపోతే, ఉసుకో అంటే, ఉసుకో అన్నదట.
మాటలు పోయినాక మూటలు పనికిరావు.
మాటలే మంత్రాలు, మాకులే మందులు.
మాటే లేకుంటే చోటేలేదు.
మాట్లాడ నేరిస్తే, పోట్లాటరాదు. (పోట్లాడ పనిలేదు)
మాట్లాడుతుంటే వచ్చేవి మాటలు, గొరుగుతుంటే వచ్చేవి వెంట్రుకలు.
(బొచ్చు)
మా తాతలు నేతులు తాగారోయి, మా మూతులు వాసనచూడండోయ్.
మా దేవునిసత్యం మాకు తెలియదా?
మానవసేవే మాధవసేవ.
మానవులుండరుగాని, మాటలు ఉండి (నిలచి) పోతవి.
మానిందే మందు, బతికిందే ఊరు.
మామా ఒకయింటి అల్లుడే! అత్తా ఒకయింటి కోడలే!
మా యింటాయన వ్రాసింది మా యింటాయనే చదువాలంటే,
మా యింటాయన రాసింది మా యింటాయనే చదవలేడన్నదట!
మారుచీర లేక మేలుచీర కట్టుకొన్నట్లు.
మావాడు దెబ్బలకోరుస్తాడు అంటే, విడిపించే దిక్కులేక అన్నట్లు.
మాస(ష) మెత్తు బంగారు మనిషిని గాడిద చేస్తుంది.
మాసిన కలకు మల్లెపూల అలంకారమా?

మింగను మెతుకు లేకుంటే, లంజకు లత్తుకట!
మింటికి మంటికి ముడి వేసినట్లు.
మితం తప్పితే హితం తప్పుతుంది.
మిథునంలో పుట్టిన మొక్క, మీసకట్టులో పుట్టిన కొడుకు అక్కరకు వస్తారు.
మిద్దె ఉన్నవాడు బ్రతికి, గుడిసె ఉన్నవాడు చావడు.
మిన్ను విరిగి మీద పడితే అరచేతితో అడ్డగలమా?
మిన్ను విరిగి మీద పడ్డట్లు.
మిరపకాయ చిన్నదని మేలమాడరాదు.

మీ ఇంటి గేదె, మా ఇంటి దూడ, తీసుకురా తమ్మక్కా వీసెడు నెయ్యి.
మీ గురువులు మా శిష్యులవద్ద చదువుకున్నారు.
మీద మెరుగులు, లోన పురుగులు.
మీ యింట్లో తిని, మా యింట్లో చేయి కడుక్కొన్నట్లు

ముందేటి కంటకానికి అద్దు ఏముంది?
ముందుకు పోతే మురికిముండ, వెనకకు పోతే పెద్దిముండ.
ముందున్నది ముసళ్ళ పండగ.
ముందు పెళ్ళాం బిడ్డలు ముంతఎత్తుకు తిరుగుతూ ఉంటే, లంజకు
బిడ్డలులేరని రామేశ్వరం పోయినాడట.
ముందుకుపోయేది ముండ్లకంప, వెనుకపోయేది వెన్నముక్క.
ముందు మునగ, వెనుక వెలగ. (కూడదు)
ముందువచ్చిన చెవులకంటె, వెనుకవచ్చిన కొమ్ములువాడి (ఎక్కువ)
ముక్కుపట్టుకుంటే ప్రాణం పోతుంది. (దుర్బలుడనుట)
ముక్కు మూరెడు, సిగ బారెడు.
ముక్కు మొగం లేనిబిడ్డ. మొదలుతుద లేనిపాట.
ముక్కులో ఏవేలు పెట్టినా సరిపోతుంది.
ముఖము బాగులేదని అద్దం పగలగొట్టినట్లు.
ముఖానికి ముక్కుసర, దండకు కొలికాసర.
ముఖాలుచూచి బొట్టుపెడతారు, పిఱ్ఱలుచూచి పీటవేస్తారు.
ముట్టుకుంటే ముత్యం, పట్టుకుంటే బంగారం.
ముడి మూరెడు సాగదు.
ముత్యాలు పగడాలు, ముట్టుకున్న జగడాలు.
ముదికొమ్మ వంగదు, ముదిగొడ్డు ఈనదు.
ముదిమికి ముచ్చట్లు లావు.
ముద్దున పేరు చెడె, మురిపాన నడకచెడె.
మునిగితే గుండు, తేలితే బెండు.
మునిగేవానికి తెలుసు నీటి లోతు.
మున్నూరు శిఖలైనా కూడవచ్చునుగాని, మూడు కొప్పులు కూడరాదు.
ముప్పొద్దు తిన్నమ్మ మొగుడి ఆకలి ఎరుగదు.
ముసలివానికి ముండ ముద్దు.
ముసుగులో గుద్దులాట.
ముహూర్తం మంచిదయితే, ఎట్లా ముండ మోసెరా? అన్నట్లు.
ముగ్గురిని కూర్చెరాముండ దయ్యమ్ (పెండ్లికొడుకుకు నత్తి
పెండ్లికూతురికి నత్తి, పురోహితునికి నత్తి)

మూడు కొప్పులు ఒకటైతే ముల్లోకాలు ఏకమౌతవి.
మూడు దినాలుంటే మురికిముండ.

మూడు జన్మల సంగతి చెప్పగలను, పూర్వజన్మలో ఇచ్చి పుచ్చుకోలేదు,
కనుక ఈ జన్మలో లేదు నాయనా!
కనుక మరు జన్మలో ఏమీ ఉండదు.
మూడు పావలాల గుడ్డ, ముప్పై రూపాయల కుట్టు.
మూడు మాటలు
మూడో తరగతిలో ఎందుకు ప్రయాణం చేశావంటే,
గ్రో ... ఇట్టి అన్నాడట.
మూలుగులు మునపటిలాగే, భోజనాలు ఎప్పటిలాగే.
మెడలో రుద్రాక్షలు, మదిలో పదిరాక్షలు.
మెతుకులు చల్లితే కాకులకు కొదువా?
మెత్తగా ఉంటే మొత్తబుద్ధి వేస్తుంది.
మెఱుపు దీపంగాదు, మబ్బు గొడుగుకాదు!
మేకకు తెలిసినదంతా మేత సంగతే.
మేతకన్న మసలితేనే బలం.
మేపే రూపు.
మేసేగాడిదను కూసేగాడిద (వచ్చి) చెఱచిందట.
మొండికి సిగ్గులేదు, మొరడకు గాలిలేదు.
మొక్క అయి వంగనిది, మ్రానై వంగునా?
మొగుడి మీద కోపం పొద్దు మునిగేవరకే.
మొగుడు చచ్చిన వెనుక ముండకు బుద్ధి వచ్చిందట!
మొగుడు ముండా అంటే, ముష్టివాడు (కూడా) ముండా అంటాడు.
మొగునితో పెళ్ళికి, పిల్లలతో తీర్థానికి వెళ్ళరాదు.
మొయిలు విడిచిన ఎండ, మొగుడు విడిచిన ముండ, పట్టి విడిచిన మంట,
ఎత్తివిడిచిన కుండ.
మొఱిగే కుక్క కఱవదు.
మొలది విప్పి తలకు చుట్టినట్టు.

## య

యథార్థవాది లోక విరోధి.
యథార్థానికి ఏడుచుట్లు, తెరలు అక్కఱలేదు.
యథారాజా తథాప్రజా.

## ర

రచ్చకెక్కిన తర్వాత రాయబార మేల?

రత్నాన్ని బంగారంలో పొదిగితే రాణింపు.
రమాపతే, సీతాపతే, పొద్దునలేస్తే పొట్టేగతి.
రవిక, పగలు బిడ్డకడ్డాము, రాత్రి మగని కడ్డాము.
రవి గాననిచో కవిగాంచ నేర్చును.
రసం ముదిరితే రాగం, పాకం ముదిరితే పాట.
రహస్య మేమిటంటే, (విశేష మేమిటంటే) వడ్లగింజలోది బియ్యపుగింజ అన్నట్లు.
రంకునేర్చినమ్మ బొంకునేర్చునట.
రంకు సాగితే పెళ్ళెందుకురా : పెదబాబూ అన్నాడట.

రామేశ్వరం వెళ్ళినా శనేశ్వరం తప్పదన్నట్లు.

## ల

లంక కాల్చినవాడు రాముడి లెంక.
లంకలో పుట్టినవాళ్ళంతా రాక్షసులే :
లక్ష నక్షత్రాలయినా ఒక చంద్రుడు కాడు.

## వ

వంకరో టింకరో వయసే చక్కన.
వంద మాటలు మాటలాడవచ్చు, ఒక్కనికి పెట్టేది కష్టం.
వంపున్నచోటికే వాగులు పోతాయి.
వగలు ఎందుకంటే, పొగాకుకోసం అన్నట్లు.
వచ్చినపేరు చచ్చినాపోదు.
వచ్చిపోతూ ఉంటే బాంధవ్యము యిచ్చిపుచ్చుకుంటే వ్యవహారము.
వచ్చీరాని మాటలు, ఊరీ ఊరని ఊరగాయ రుచి.
వచ్చీరాని మాట వరహాలమూట.
వచ్చు కీడు వాక్కే చెప్పును.
వజ్రానికి సాన-బుద్ధికి చదువు.
వట్టిచేతులలో మూరవేసి ఏమిలాభం ?
వట్టి నేలలో కప్ప అరచినా, నల్లచీమ గుడ్డుమోసినా వాన తప్పదు.
వనం విడిచిన పక్షి, జనం విడిచిన మనిషి.
వనితగాని, కవితగాని, వలచి రావాలి.
వన్నె చీర కట్టుకున్న సంబరమేకాని, వెట్టికుక్క కఱచినదెరుగదు.
వయసు తప్పినా ఒయ్యారం తప్పలేదు.

వయస్సు ముసలెద్దు, మనస్సు కోడెదూడ.
వరదలు వస్తాయని వర్షాకాలగప్పు.
వశిష్ఠుని వాక్కున విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అనిపించుకోవలె.
వెట్టివాని పెళ్ళం వాడంతటికీలోకువ.
వ్యాధికి మందుగాని, విధికి మందా?
వ్యాపారం జోరుగా సాగిపోతున్నది, రెండోబస్తైను అమ్మి డబ్బుపంపమన్నట్లు.
విఫంచెద్దా ఫలం దక్కవలె.

శంకులో పోస్తే తీర్థం, పెంకులో పోస్తేనీళ్ళు.
శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు.
శనేశ్వరానికి నిద్ర ఎక్కువ, దరిద్రానికి ఆశ లెక్కువ.
శరము తప్పిన చెవులు వినరావు, గుణము తప్పిన కళ్ళు కానరావు.
శల్య సారథ్యం.
శవానికి చేసిన అలంకారంవలె.

# స

సంక్రాంతికి చంకలెత్తకుండా చలి,
సంతలో కొడితే సాక్షులెవరు?
సంతోషం సగం సత్తువ.
సంపదలో మరపులు, ఆపదలో అఱుపులు.
సంపద మరపులు ఆపదలో మ్రొక్కులు
సంపాదన ఒకరిది, అనుభవం ఇంకొకరిది.
సంసారం జేనెడు, ఖర్చు బారెడు.
సంసారం బాగాలేదని సన్యాసం పుచ్చుకుంటే,
బూడిద, బుఱ్ఱకాయగాడిద బరువైనాయట!
సన్యాసికి దొంగల భయమేమి?
సన్యాసి సన్యాసి రాసుకుంటే, బూడిద రాలిందట!
సభాపిరికివానా! యింటిలో లేడని చెప్పవే!
సమయానికి లేనిది చంకనాకనా?
సముద్రం నడుమ ఉన్నా, త్రాగునీటికి కరవే!
సముద్రములో కెరటాలు అణిగిన తరువాత స్నానం చేదామనుకున్నాడట!
సముద్రములో వాన పడినట్లు
సముద్రానికి ఏతాము వేసినట్లు.
సమ్ముఖానికి రాయబార మేల?

సరసము విరసము కొఱకే.
సరిపడనివారు చచ్చినవారితో సమానం.
సర్కారుకు చాటుగా ఉండాలి, సావుకారి కెదురుగా ఉండాలి.
సముద్రములో కాకిరెట్ట చందాన.

## హ

హంస నడకలు రాకపోయె, కాకినడకలు మఱచిపోయె.
హనుమంతుని ముందు కుప్పిగంతులా ?
హరిదాసున కందరూ తనవారే.
హరిశ్చంద్రుని నోట అబద్ధంరాదు, నా నోట నిజంరాదు.
హాజరు జవాబు, అదేఫోత,

క్షణం చిత్తం-క్షణంమాయ ;
క్షణం తీరికలేదు-దమ్మిడీ ఆదాయం లేదు.
క్షేత్ర మెఱిగి విత్తనము, పాత్ర మెఱిగి దానము.
క్షేమంగా వెళ్ళి, లాభంగా రా.



ఇది
యువభారతి
ప్రచురణ



# ప్రజా సూక్తం

తెలుగు సామెతల సంకలనం